అనంతలక్ష్మి కంబైన్స్

# ఈ కాలపు పిల్లలు



# దోమలు జీవితాన్ని దుర్భరం చేస్తాయి





## మీకు కావాలి
# ఓడోమాస్




లక్షలాది ప్రజలు నమ్మకంతో వాడేది ● పసిపాపలకు కూడా నిరపాయకరమైనది

# "నేను ఆ ఐదు రోజులు ఎవరి ముందుకూ వెళ్లేదాన్ని కాదు.



ఇప్పుడు నాకు 'కేర్ ఫ్రీ' సానిటరీ నేప్‌కిన్‌లను
గురించి అదృష్టవశాత్తు తెలిసింది మరియు
నెలలో 30 పూర్తి రోజులు హాయిగా వున్నాను!"

వండర్‌రాప్‌గల క్రొత్త కేర్‌ఫ్రీ స్త్రీయొక్క
దేహమునకు పూర్తి సౌఖ్యమును, పూర్తి రక్షణను యిస్తుంది.

నెలలో ఆ ఐదు రోజులు స్త్రీయొక్క దేహమునకు ఒక ప్రత్యేక
మైన రకపు రక్షణ తప్పకుండా కావాలి ఆ బాధ్యతను
తీసుకొనుటకు యిప్పుడు కేర్‌ఫ్రీ ఉంది
కేర్‌ఫ్రీ యొక్క పై పొరయగు సాటిలేని వండర్‌రాప్ చెమ్మను లోపలి
పొరలలోనికి త్వరగా పీల్చుకొంటుంది కనుక మీ చర్మము
పొడిగా ఉంటుంది మరియు మీరు సౌఖ్యముగా ఉంటారు.



కేర్‌ఫ్రీ మాత్రమే నేప్‌కిన్ లోపలి పొరలలోనికి
చెమ్మను పకరీతిగా చరేలా చేసే, ప్రత్యేకమైన
పీల్చే గుణముగల పదార్థముతో తయారుచేయబడినది
అందువలన ఒకే చోటు తడిసి పాడవదు
నేప్‌కిన్ అడుగు భాగమంతా మరియు రెండు
వైపులా చుట్టివున్న నీలి అంచు కారణముగా
మరక పడుతుందను బాధ ఉండదు.

కేర్‌ఫ్రీ వాడుకలో ఎంతో వీలైనది. ఎందుకంటే, దానిని
ఉపయోగించిన తరువాత సులభముగా 'ఫ్లష్' చేయవచ్చును.
కనుక మీరు బయట తిరుగునపుడు లేక ప్రయాణములో
చికాకు పడరు.

కేర్‌ఫ్రీ మీ దేహమునకు సౌఖ్యముగా
సరిపోయేలా మార్చుకోగలిగే సైజులో
లభిస్తోంది. ప్రతి ప్యాకులోను
ఉచితముగా యివ్వబడే కేర్‌ఫ్రీ
బెల్టు పెట్టబడింది.

**అమ్మయ్య! మీరు నెలలో
30 పూర్తి రోజులు
హాయిగా ఉండగలరు!**

ఇంకా, ఎక్కువ
మంచి వస్తువులు
కావాలనే స్త్రీలకు
క్రొత్త, మేలు రకపు,
మార్చుకోగలిగే బెల్టు విడిగా
అమ్మబడుతోంది. దానిని కేర్‌ఫ్రీ సానిటరీ
నేప్‌కిన్‌లను అమ్మే షాపులలో చూడండి.

ఇప్పుడు
చేతిలో యిమిడే
క్రొత్త
పోలి బ్యాగ్‌లో




జాన్సన్ & జాన్సన్ * స్త్రీలకు [illegible]

* Trade Mark © Johnson & Johnson India Ltd.

# అమరావతి-ధరణికోట ప్రత్యేక ప్రదర్శన


కార్తికేయశర్మ

[భారతీయ పురావస్తు సర్వేక్షణ]


రచయిత శ్రీ కార్తికేయశర్మ గారు ఆంధ్రదేశానికి నడిమధ్యలో ఉన్న అమరావతి చరిత్రని క్లుప్తంగా, చక్కగా వర్ణించారు. ఈ వ్యాసం వుద్దేశ్యం ఏమిటో శ్రీ శర్మ గారే చెప్పారు!

సంపాదకుడు

**ఆంధ్రలో ప్రాచీన కళలకి, సంస్కృతికి నిలయమయి నది గుంటూరు జిల్లాలోని అమరావతి - ధరణికోట.**

1797 లో కర్నల్ మెకెంజీ ఈ ప్రాంతాన్ని దర్శించిన నాటి నుండి పలువురు పురాతత్వ శాస్త్రజ్ఞులు, చరిత్రకారులు, కళోపాసకులు తవ్వకాలు సాగించారు

ఎలియట్, సీవెల్, బర్గెస్, రీ, సుబ్రహ్మణ్యము, వెంకటరామయ్య, కార్తికేయశర్మ తవ్వకాలు సాగించి అమరావతి స్థూప, వాస్తు, శిల్ప చరిత్రని ప్రచురించారు చివరి ముగ్గురి పరిశోధనలు 1958 నుంచి 1975 మధ్య కాలంలో జరిగాయి.

అశోకుని శిలా శాసన స్తంభంలోని భాగము



అమరావతి శిల్పం, బౌద్ధారామాలు ప్రపంచ ఖ్యాతిని పొందాయి ఇక్కడి శిల్పం వివిధ ప్రదర్శనశాలలలో, ప్రపంచం అంతటా ఆరాధింపబడుతున్నాయి.

అమరావతి, ధరణికోట ప్రాంతం చరిత్ర పూర్వ యుగాలలో కూడా ఒక గొప్ప పురావస్తు–అవశేషాల ఖని.

ఇక్కడ పాతరాతి యుగపు రాతిగొడ్డళ్ళు, చెక్కే పనిముట్లు, కత్తులు ఎన్నో దొరికాయి. ఇవి 1,50,000 సంవత్సరాలనుంచి 30,000 సంవత్సరాల పూర్వపు కాలానివి ఈకాలంలో మనుష్యులు వేటాడి బతుకుతూ ఉండేవారు.

మధ్యరాతియుగం 30,000 నుంచి 8,000 సంవత్సరాల పూర్వపు కాలానికి చెందినది. ఈ కాలపు చిన్న పనిముట్లు కూడా ఇక్కడ దొరికాయి.

## నూతన రాతియుగం

సుమారు 8,000 ఏళ్ల క్రితం నూతన రాతియుగం మొదలయి 5,000 సంవత్సరాలపాటు కొనసాగింది "ఆహారం ఉత్పత్తి" చేసుకొనటం, నివాసాలు ఏర్పరచుకొనటం నూతన రాతియుగంలోనే మొదలయింది. రాతి నాగళ్ళు, చెట్లు కొట్టటానికి గొడ్డళ్ళు, కత్తులు, రంపాలవంటి పనిముట్లు, కొడవళ్ళు ఈకాలపు అవశేషాలు. ముత్యాలపాలెం, అమరావతి – ధరణికోట, వైకుంఠపురం మొదలయిన గ్రామపరిసరాలలో ఇవి దొరికాయి

స్థూపం పునాదులలో పోసిన మట్టిలో కూడా యివి లభ్యం అయినాయి.

ఇనుపయుగం 3,000 సంవత్సరాల పూర్వంనుంచి 2,300 సంవత్సరాల పూర్వం దాకా కొనసాగింది. ఈ కాలంలో ఆంధ్రలో మట్టిపాత్రలు (ముఖ్యంగా ఎరుపు–నలుపువి) చాలాచోట్ల "రాక్షసిగుళ్ళు" అనబడే సమాధులలో దొరికాయి. ఒక చిన్న స్థూపం కిందనే మట్టికుండల సమాధి వెలికివచ్చింది



అశోకునికాలపు లిపివున్న పునుపైన నిలువుస్తంభం

ధరణికోట తవ్వకాలలో, మహాచైత్య సమీపంలో, అట్టడుగు స్తరములలో ఇనుప పనిముట్లు, ఎరుపు – నలుపు మృణ్మయ పాత్రలు లభ్యం అయినాయి అంటే, చరిత్రకి పూర్వయుగంలోకూడా ఈ ప్రదేశం ప్రసిద్ధిలో ఉండేదన్నమాట.

## చారిత్రిక అవశేషాలు

నేడు గుండ్రంగా కనిపించే దిబ్బలు పూర్వం ఒకప్పుడు బుద్ధధాతువు వున్న మహాస్థూపం చిత్రాలంకారశోభితమయిన చైత్యం, తోరణాలు కల సింహద్వారాలు, వేదిక, శ్రీవీధితో శోభిల్లింది. ఈ ఆకృతి, పేరు పెంపులు సాతవాహనుల కాలం నాటిదిగా తెలుస్తోంది. ఇది క్రీ. శ. నాటిది. క్రీ. పూ. నాటి స్థూపాకృతి ఎటువంటిదో? ఎప్పుడు, ఎవరు కట్టించారో? ఆంధ్రదేశానికి బౌద్ధం ఎప్పుడు వచ్చిందో? ఇవన్నీ సమస్యలుగానే ఉండిపోయాయి.

1974 – 75 తవ్వకాలలో లభించిన కొన్ని ముఖ్యమయిన పురావస్తు – అవశేషాలని ఇటీవలే ( మార్చి 13–20 ) ప్రదర్శింపబడినాయి. ఈ తవ్వకాలలో కొన్ని నూతనాంశాలు వెలువడినాయి. అవి ఏమిటో పేర్కొంటాను.

### కాలం -1 (క్రీ పూ 4 - 3 శతాబ్దాలు)

అమరావతిలో కొన్ని సంవత్సరాల క్రితం అశోకుడి శిలాశాసనం ఒకటి దొరికింది ఇది క్రీ పూ (3) శతాబ్దాలకి చెందిన, నల్ల రాతి స్తంభాలు ఉన్న స్తరాలలో దొరికింది అంటే, ఈ మహా చైత్యాన్ని మొదటిసారిగా ఉద్ధరించి, ముఖ్య ద్వారాలతో వేదికని ఏర్పాటు చేసినది అశోక చక్రవర్తే అని స్పష్టం అవుతుంది!

దక్షిణదేశంలో మొదటిసారిగా ఎన్ బి పి (న్యూ బ్లాక్ పాలిష్డ్ లేక కొత్త మెరుపు పెట్టబడిన నలుపు) మృణ్మయావశేషాలుకాక



యక్షిణి శిల్పం

లోహాల రంగులతో మెరిసే పాత్రలు ఇక్కడే లభ్యం అయినాయి.

ఈ రాతిస్తంభాల కాలానికే చెందిన ఒక గాంధార శిల్పం ఒకటి ఉంది. ఇది శిథిలంగానే ఉందికాని దక్షిణ భారతదేశంలోని అతి ప్రాచీనమయిన శిల్పం.

### కాలం-2 (క్రీ పూ 2-1 శతాబ్దాలు)

ఈకాలంలోనే "అమరావతి శైలి" ఆవిర్భవించింది దీనికి చెందిన అవశేషాలు కొన్నిటిని ఇక్కడ పేర్కొనవచ్చు యక్షిణి శిల్పం, మౌర్య కాలపునాటి వెండినాణాలు, మొదలయినవి స్తూపాకృతిని చూపే సూచీ పటంవలన ఈ కాలంలో మహాచైత్యం యొక్క రూపు రేఖలు ఎలాగ వుండేవో తెలుస్తుంది పటం-3 యక్షిణి శిల్పానిది, పటం -4 సూచీపటానిది.

### కాలం-3 (శాతవాహనులు. క్రీ శ 1-3 శతాబ్దాలు)

ఈ కాలంలో స్తూప వస్తువు పేరు, పెంపులు పెక్కువిధాలుగా వృద్ధి అయినాయి. చాలా ఎత్తయిన ప్రాకారం, సింహద్వారాలతో మహత్తర కళాఖండమయి విరాజిల్లింది స్తూప అధిష్ఠానం, అండం సాతహ్వా కృలాలు ఈ కాలపు అవశేషాలలో శాతవాహనుల నాణాలు దొరికాయి. గాజు వస్తువులు, బంగారు నాణాలు రోము పట్నంతో సంబంధాన్ని తెలుపుతాయి ఈ కాలంలో బుద్ధుడిని విగ్రహరూపంలో ఆరాధించేవారు

పూర్ణకుంభ శిల్పం ఈనాటిదే! దీనిని ఒక చర్మకారుడు దానంచేశాడు ఇది అమరావతీ శిల్పశైలికి శోభస్కరమయి, ఆంధ్ర శిల్పికి సర్వమంగళకరమయినది (పటము-5)

### కాలం-4 (ఇక్ష్వాకు, పల్లవ, విష్ణుకుండినులు క్రీ శ 3 - 6 శతాబ్దాలు)

పయిన చెప్పిన రాజవంశాలు ఏలిన కాలాల నాటికి చెందిన పెక్కు శిల్పాలు, నాణాలు, మట్టిపాత్రలు దొరికాయి (పూర్వ, అపర, శైల మహాచైత్యక, బౌద్ధ మతశాఖలతో అత్యంత శోభాయమానంగా వెలిసింది

### కాలం5 (క్రీ శ 6-11 శతాబ్దాలు)

ఈ కాలంలో గూడా ఎన్నో చిన్న స్తూపాలు, ఆరామాలు, బుద్ధ గృహాలు నిర్మింపబడినాయి

ఈ కాలంలోనే చీనా యాత్రికుడు హువాన్‌ట్సాంగ్ ధరణికోట ఆరామంలో నివసించి "అభిధర్మా"న్ని చదివాడు.

ఇది "వజ్రయానం" ప్రబలిన కాలం, "ధర్మ కీర్తనాలు" కల మట్టి బిళ్లలు; బోధిసత్వ పద్మపాణి, హేరుక, సింహనాద, తార, హారీతి మొదలయిన విగ్రహాలు కూడా దొరికాయి

కోట కేతరాజు (క్రీ. శ. 1182) కాలం నాడు మహాస్తూపం అత్యున్నతమయి, నానావిచిత్ర సుచిత్రమయి విరాజిల్లింది

క్రీ. శ 1344 లో సింహళ దేశపు స్థవిర ధర్మకీర్తి చైత్య పరిసరంలో రెండంతస్తుల గృహాన్ని కట్టించాడు.

18 వ శతాబ్దంలో ఇది 'దీపాలదిన్నె'గా ఖ్యాతి గాంచినట్లు తెలుస్తోంది.

అమరేశ్వరాలయం మహా పవిత్రమయిన



మహా చైత్య స్తూపాకృతి

పంచారామక్షేత్రాలలో ఒకటి ఇది సింహ పరిషత్తుకి స్థానంగా ఉండేది ఇంద్రుడే లింగ ప్రతిష్ఠ కావించాడంటారు

అమరేశ్వరాలయంలోని శాసనాలు (సుమారు 35) క్రీ శ 1129 నుంచి 1626 వరకు ఈ క్షేత్రానికి వచ్చి భగవంతుని దర్శించుకుని, భూరిదానాలు ఇచ్చిన చాళుక్య, కోట, వెలనాడు, కాకతీయ, విజయనగర రాజులు వెలయించినవి శ్రీకృష్ణదేవరాయలవారు కొండవీడు దిగ్విజయం తరువాత అమరేశ్వరుడికి "తులా పురుష" దానం ఇచ్చారు.

అమరావతిలో దొరికిన ఎన్నో శాసనాలు బౌద్ధమత సంఘం ఎటువంటి విశిష్టమయిన సంఘ, మత, వృత్తి సామరస్యానికే కాక సమతలకి దారితీసిందో తెలుపుతాయి ఒక ఉష్ణీష శిల్పాన్ని క్రీ. పూ 3-2 శతాబ్దాలలో ఒక రాజకుమారి సమ్మరి చెలికత్తెలు కావించారు మరొక శిల్ప స్తంభాన్ని ఒక పశువుల కాపరి దానంచేశాడు పూర్ణకుంభాన్ని చర్మకారుడు దానంచెయ్యడం పేర్కొనబడింది చిన్నవారి దానాలు కూడా పెద్దవారి దానాల పక్కనే

అమరావతిలోని పూర్ణకుంభము



## అమరావతి ప్రదర్శన



అమరేశ్వరాలయము

అమర్చబడి వుంటాయి. ఇది ఒక మహత్తర విషయం.

ఇంత మహోన్నతమయిన పురావస్తు సంపద, చారిత్రిక సంస్కృతిని, క్రీ. పూ. 4వ శతాబ్దం నుంచి క్రీ.శ. 18వ శతాబ్దం దాకా కొనసాగిన చరిత్రకల సుక్షేత్రం భారతావనిలో మరెక్కడా లేదన్నా అతిశయోక్తి కానేరదు.

ప్రతి పౌరుడూ, ప్రతి విద్యార్థీ ఈ ప్రాచీన స్థలాన్ని తప్పకుండా చూడాలి. విద్యా సంస్థలలో మన చారిత్రిక సంస్కృతులని గూర్చిన అధ్యయనం తీరిక సమయాలలో నయినా చెయ్యాలి.

ఈ ధ్యేయంతోనే భారత ప్రభుత్వంవారు "నేషనల్ సర్వీసెస్ స్కీమ్" అన్న పథకాన్ని 1975 నవంబరు నుంచి 1976 ఏప్రిల్ దాకా రూపొందించారు—విశ్వవిద్యాలయ, కళాశాలల విద్యార్థులని ఒకచోట చేర్చి చారిత్రిక విశేషాలపట్ల ఆసక్తి కలిగించే కార్యక్రమాలు, చారిత్రిక విశేషాలని బాగు పరిచి పదిలంగా ఉంచే కార్యక్రమాలు ఏర్పరచడం ఈ పథకం లోని ప్రధానాంశం. ఆంధ్రదేశంలోని చంద్రగిరి, గుడిమల్లం, అమరావతి—వీటిలో ఎన్నో రకాల కార్యక్రమాలు ఏర్పాటు చెయ్యబడినాయి. అమరావతి ప్రదర్శనని ఆచార్య నేలటూరి వెంకటరమణయ్యగారు ఆవిష్కరించారు. సభకి అధ్యక్షత వహించిన డాక్టరు రావిప్రోలు సుబ్రహ్మణ్యంగారు శ్రీ కార్తికేయ శర్మ చేసిన పరిశోధనలని వివరించారు.

'కృష్ణా నదీజలాలని మదరాసుతోని మన తమిళసోదరులకి అందించి వారి అవసరాలని తీరుస్తున్నట్లే మదరాసు గవర్నమెంటు మ్యూజియంలోని అమరావతి కళాఖండాలని కొన్నిటినయినా బదులు ఇచ్చి తమిళనాడు వారు మన లేమిని తీర్చాలని ఆచార్య వెంకటరమణయ్యగారు అన్నారు.

అమరావతి ప్రదర్శనలు విజయవంతం కావటానికి ఎందరో ఎన్నోవిధాలుగాతోడ్పడ్డారు.★

గమనిక :— చిత్రపటాల కాపీరయిటు భారత పురావస్తుశాఖ, భారత ప్రభుత్వంవారిది.

# వెలుగుబాట

## పి.వి.బి. శ్రీరామమూర్తి

(గత సంచిక తరువాయి)

"రా అమ్మా! ఇలారా" సోఫాలో కూర్చుంటూ అన్నారు. మెల్లగా వెళ్లి తండ్రి ప్రక్కనే కూర్చుంది వాణి. కూతురు తలమీద చెయ్యివేసి జుట్టు నిమురుతూ, "చూడమ్మా! ఆవేశంలో ఏ నిర్ణయాన్నీ తీసుకోకూడదు జీవితం, దానిలో ఒడిదొడుగులూ నీకేం తెలుసమ్మా చెప్పు? అదీకాక. పెద్దవాళ్ళం ఏ పని చేసినా మీరు హాయిగా ఉండాలనేగా చేస్తాం కాని మీకు కష్టం కల్గించినట్లు చెయ్యంకదా తల్లీ చూడమ్మా అబ్బాయెంత బాగుంటాడో చూడు. అమ్మా, అన్నయ్యలూ, వదినలూ అంతా ఈ సంబధమైతే నీ కెంతగానో కుదురుతుందని ఎంత పొంగి పోతారనకున్నావ్ మేం చెప్పినట్లు వినమ్మా, నీ ఫొటో చూస్తేనే అబ్బాయి ఎంత నచ్చాడో తెలుసా? ఆడపిల్లకి అందమైన వరుడూ, ఐశ్వరం ఉంటే అంతకంటే ఇంకేంకావాలి చెప్పు? అసలు అబ్బాయికేం లోటు చెప్పు?" అని బోధపరిచారు సామదాయకంగా.

వాణి మాటాడకుండా వూరుకుంది

"చూస్రా! అమ్మాయెంత మంచిదో. ఎంత బుద్ధిగా ఒప్పేసుకుందో?" అన్నారు చుట్టూరా వున్న కొడుకుల్ని చూసి. వెంటనే వాణి తలఎత్తి, "నేనేం వప్పకోవటంలేదు నేను రాజును తప్ప యింకెవర్నీ చేసుకోను" అనేమాటలు వినేసరికి రామచంద్రరావుగారి ముఖం పాలిపోయినట్లయిపోయింది. కోపాన్ని పట్టలేక "వాణీ!" గట్టిగా అరిచారు అందరికీ ఏమౌతుందోనని భయం వేసి బొమ్మల్లా నిల్చుండిపోయారు వెంటనే రామచంద్రరావుగారి పెద్దకోడలు జానకివచ్చి "నే చెప్తా మీరేం ఆవేశపడిపోకండి మామయ్యగారూ! అమ్మా వాణీ ఇలా రామ్మా!" అని దగ్గరగా తీసికుందామె. వాణి కళ్ళ వెంబడి కారుతున్న కన్నీటిని పైట చెరుగుతో వత్తుతూ, "ఛీ! తప్పు కదూ! అలా ఏడవవచ్చా?" అంది జానకి. అందరూ స్తబ్దులైపోయారు. "వాణి చూడమ్మా నాన్నగారెంత బాధపడుతున్నారో? ఆయన్నంత బాధ పెట్టవచ్చా? తప్పు కదమ్మా బుద్ధిగా నాన్నగారు చెప్పినట్టు వినుకొని, పెళ్లి చేసుకొంటే ఆయనెంత సంతోష పడిపోతారో తెలుసా? మేం మా నాన్నగారు చెప్పినట్టు వినుకోబట్టే ఇప్పుడెంత హాయిగా ఉన్నామో చూడమ్మా?" అని వాణిని ముద్దుగా ఓదార్చసాగింది జానకి

"ఏం? రాజుని నేను పెళ్లిచేసుకుంటే నాన్నగార్ని సంతోష పడవద్దన్నానేమిటి?" మెల్లగా అంది వాణి

"తప్పమ్మా. అలాగనకూడదు. పెద్దవాళ్ళ మాటకెప్పుడు ఎదురు తిరగకూడదు" గోముగా అంది జానకి.

"వదినా! నేనెప్పుడైనా ఎదురు చెప్పేనేంటి? ఇప్పుడైనా నాన్నగారికి నేనేం ఎదురు చెప్పాను ఒదినా! నా యిష్టాన్ని కాదని, నా కోరికల్ని చంపుకుని నాన్నగారు చూసిన సంబంధాన్ని నేనెలా చేసుకోను? నువ్వే చెప్పు. ఈ విషయంలో మాత్రం నా యిష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించలేను. కోపం కలిగిస్తే నీ చేతికొచ్చిన దెబ్బలు కొట్టు" చలనంలేకుండా సమాధానం చెప్పింది వాణి "వాణీ! ఎందుకని వూరుకుంటే మరి కొంచెం అధికమై పోతున్నావ్. ఇటురా. నాన్నగారు చెప్పినట్లు విన్నావో సరి. లేకపోతే పళ్ళు రాలగొడలాను అయినా దాన్నంతగా బ్రతిమలాడటం దేనికమ్మా! ఎవరికోసం వింటుంది? చెప్పినట్లు వినకపోతే కాళ్ళూ చేతులూ కట్టిపడేసి. ఆ మూడుముళ్లూ వేయిస్తే సరి." కోపంతో అంది రాజ్యలక్ష్మమ్మ.

> **జరిగినకథ: 2** గోపాలం వ్రాసిన ప్రేమలేఖను అందుకొంటుంది రిటైర్డ్ పోలీసు ఆఫీసరు రామచంద్రరావుకూతురు కృష్ణవేణి*గోపాలంబావ, తన తండ్రికి రాసిన ఉత్తరంలో తన ఊసులేదన్న వ్యధలో చిన్ననాటి ప్రేమ గుర్తుకొస్తుంది కమలకి. తండ్రి తెచ్చిన సంబంధం యిష్టంలేదని ఖండితంగా తల్లి రాజ్యలక్ష్మితో చెప్పి, అక్క వాణిలా తన జీవితం కాకూడదని కోరుకుంటుంధి కృష్ణవేణి.

"మీరూరుకోండత్తయ్యా! వాణి చాలా మంచిది. మావయ్యగారు చెప్పినట్లు చక్కగా వింటుంది." అని వాణి చుబుకాన్ని పట్టుకుని బ్రతిమలాడింది జానకి.

"వదినా! క్షమించు. ఈ విషయంలో మాత్రం నీతో నేను ఏకీభవించలేక పోతున్నాను ఇది నా జీవిత సమస్య. మీరెవరూ వాలో చివరివరకూ రారు మీరంతా నా బాధలు తీర్చలేరు. ప్రేమించిన వ్యక్తికి దూరమై ఇష్టంలేని కాపురం చేయలేను." గట్టిగానే అనేసింది వాణి.

"వాణీ! ఏవిఁటే నువ్వు ప్రేమించింది? ప్రేమించాననుకోవటం కేవలం నీ భ్రమ. మానసిక దౌర్బల్యం. ప్రేమ అనే వలలో చిక్కుకుని జీవితాన్ని ఎంతమంది ధ్వంసం చేసుకుంటున్నారో తెలుసా? ... రాజుతో ఎంతమాత్రం నీ పెళ్లి జరగటానికి వీల్లేదు. పరువు ప్రతిష్ఠ మంటగలిపే ఆ పెళ్లి నా కళ్లముందు జరగటానికి వీల్లేదు." భీకరంగా, గర్జిస్తున్న సింహంలా అరిచారు రామచంద్రరావుగారు.

"జీవితం మంట గలిసి పోయిన తరువాత పరువు ప్రతిష్ఠ ఎవరిక్కావాలి?" తల వంచుకుంటూనే ఒక్కొక్క మాట అంది వాణి.

"వాణీ!" ఎత్తిన చెయ్యి వాణి చెంపల వరకూ వచ్చి ఆగిపోయింది. "ఆడపిల్లవయిపోయావ్. లేకపోతే ఏం చేసేవాడినో" అన్నారు పళ్లు కొరుకుతూ, తరువాత అందరివేపు చూస్తూ, "ఏవర్రా! ఇదిలాటి పిచ్చి పిచ్చి వేషాలేస్తోందని మీకింతకుముందే తెలుసా? మాటాడరేం?" ప్రశ్నించారు. అతని హృదయాన్ని రంపంతో కోస్తున్నట్లనిపించింది. అంతవరకూ తన మాటకు ఆ యింట్లో ఎదురు తిరిగినవాళ్లు లేకపోవటంతో ఈ రోజా ఆడపిల్ల తనకి ఎదురు జవాబులు చెప్తుండేసరికి అతనిలో అహం దెబ్బతింది. సహనం నశించిపోయింది.

# వెలుగుబాట

''ఏం శంకరం నీకు తెలుసా?''

రాజు వాణిని ప్రేమిస్తున్నట్లు, వాణి రాజును ప్రేమిస్తున్నట్లు శంకరానికీ, కృష్ణవేణికి అంతకు ముందే తెలిసినా, కిమ్మనకుండా వూరుకున్నారు వాణి రాజునే పెళ్లి చేసుకుంటే వచ్చే నష్టమేముంది? రాజుకేం తక్కువ?' అని అడుగుదామనుకున్న శంకరానికి తండ్రి...భీకర ఆకారం చూసిన తరువాత మాటలు నోటిని దాటి రాలేదు వాణిలో ఎంత ఆవేదన చెలరేగుతోందో, ఎలా కుమిలిపోతోందో వూహించుకున్న శంకరానికీ, కృష్ణవేణికి మాత్రం ఆబాధ భరించరానిదిగా అనిపించింది.

''నాన్నా! నేను నచ్చచెపుతానులెండి తరువాత దాన్ననవసరంగా బాధపెట్టకండి'' అని ''రామ్మా. కళ్ళు తుడుచుకో. చిన్న పిల్లలా అలా ఏడవచ్చా?'' అన్నాడు రామచంద్రరావు గారి పెద్ద కొడుకు

''అవునన్నయ్యా! మీరందరూ నాన్నకే సపోర్టు ఇంతమంది అన్నయ్యలు, వదినలూ వున్నారు ఎవరూ నన్నర్థంచేసుకోరు మీరంతా నా జీవితం నాశనం చెయటానికే తల పెడుతున్నారు. రెండు చేతులు ముఖాన కప్పుకుని భోరున ఏడ్చింది వాణి. చెల్లెలు పరిస్థితిని అసహాయంగా దీనంగా కనిపిస్తున్న ఆమె చూపుల్ని చూసేసరికి అతని మనసంతా కుమిలిపోయింది రామచంద్రరావు పెద్ద కొడుక్కి, పెద్ద కోడలికి కూడా వాణి అంటే పంచప్రాణాలు కావటంచేత ఎంత నిగ్రహించుకుందామనుకున్నా కళ్ల వెంబడి నీళ్లు రాక తప్పలేదు,

ఆ రాత్రి భోజనానికి వచ్చిన రాజుకి రోజూ తనకోసం వెయికళ్లతో ఎదురు చూస్తూ తను వచ్చేసరికి నవ్వుతూ కనిపించి తాను భోజనం చేస్తుంటే తన ప్రక్కనే కూర్చుని కబుర్లుచెప్పే వాణి కనిపించకపోయేసరికి ఏదోలాగ అనిపించింది ఇల్లంతా కలయ చూసినా వాణి ఎక్కడా కనిపించకపోయేసరికి కృష్ణవేణి గది దగ్గరకు వెళ్ళి, తలుపు త్రోసి ''కృష్ణా!'' అని పిలిచాడు కృష్ణవేణి ఆపుకోలేని దుఃఖంతో పలకలేకపోయింది మరోసారి పిలిచాడు రాజు

''ఏం రాజూ!'' కృష్ణవేణి పలికింది.

''అక్క ఎటెళ్లింది కనిపించటంలేదు'' అని అడిగాడు రాజు ప్రశ్నకి సమాధానం ఇవ్వకుండా, ''నువ్వింకా భోజనం చెయ్యలేదా రాజూ?'' అని ఎదురు ప్రశ్న వేసింది.

''లేదు కాని అక్క ఏది?''

దుఃఖాన్ని దిగమింగుకుందామని ప్రయత్నించి విఫలురాలై ''తెలియదు రాజూ'' అని ముఖం ప్రక్కకి త్రిప్పుకుంది.

''కృష్ణా ఏమైంది? ఎందుకలా అయిపోతున్నావ్?''

''ఏంలేదు రాజూ. తలనొప్పి జాస్తిగా ఉంది. నువ్వెళ్ళు రాజూ భోజనానికి''

''నా భోజనం మాటకేం గాని, తలనొప్పి అయితే మందు వేసుకోలేకపోయావా?'' ఆత్రుత పడుతూ అన్నాడు రాజు

''ఫర్వాలేదులే అదే తగ్గిపోతుంది'' అని బోర్లా పడుకుండిపోయింది మంచం మీద

కొంతసేపు అక్కడ నిలబడ్డాడు రాజుకేం అర్థంకావటంలేదు వాణి కనిపించకపోవటం, కృష్ణవేణి తలనొప్పితో బాధపడటం వీటి రెండిటికీ ఏదో సంబంధం ఉన్నట్లు అనిపించింది భోజనానికి పిలుపు రావటంతో వెళ్ళిపోక తప్పలేదు రాజుకి

''రా బాబూ. ఏం? ఇంత ఆలస్యమైందేం ఇవాళ?'' పీటమీద కూర్చుంటున్న రాజు ముందు కంచం పెడుతూ అంది జానకి రాజు జానకి మాటలు వినిపించుకోకుండా ''వాణి ఎటెళ్లిందండీ?'' అని అడిగాడు అన్నం వడ్డిస్తూ ''ఏమో బాబూ, ఇంట్లోనే ఉంటుందెక్కడో'' అన్నది ముభావంగా.

''కృష్ణ తలనొప్పితో బాధపడుతోంది'' అన్నాడు రాజు అని పరధ్యానంగా కూర్చున్న రాజును ఉద్దేశించి ''చేతిమీదకి పోయ్యేదా బాబూ?'' అని నూనెగిన్నె తీసుకురావటానికి వెళ్ళిపోయింది జానకి

రాజుకి భోజనం సయించక ఏదో అంతంత మాత్రంగా తిన్నాననిపించుకొని చెయ్యి కడుక్కొని లేచిపోయాడు భోజనం చేస్తున్నంతసేపూ రాజునే ఏకాగ్రంగా చూసిన జానకికి 'వాణి తీసుకున్న నిర్ణయంలో తప్పేమీలేద'నిపించింది. సోఫాలో కూర్చుని పేపర్లు చదువుతున్న శంకరం ప్రక్క కూర్చుని ''ఏంటిసార్! ఇవాళ వాతావరణం అంతా ఏదో బాధాకరంగ కనిపిస్తోంది'' అన్నాడు రాజు శంకరం బలవంతంగా నవ్వాడు 'ఏమీలే'దన్నట్లు శంకరం కూడా మాటాడకుండా మౌనంగా కూర్చునేసరికి మనసంతా దిగాలుగా అనిపించి, అక్కడ ఉండాలనిపించలేదు

''వస్తానండీ. చదువుకోవాలి!'' అని లేచివెళ్ళిపోయాడు

''అచ్ఛా గుడ్‌నైట్'' శంకరం అన్నాడు

గడపదిగి వెళ్లిపోతున్న రాజుకి ''రాజూ!'' అన్న కేక వినిపించి వెనుతిరిగాడు

''రాజూ నాన్నగారు పిలుస్తున్నట్లున్నారు'' శంకరం గొంతు మరోసారి గట్టిగా వినిపించింది రాజుకి. రామచంద్రరావుగారు తననెందుకు పిలుస్తున్నారో రాజుకి అర్థంకాలేదు ఆ యింటికీ తనకీ సంబంధం ఏర్పడి



ఆరు సంవత్సరాలు దాటిపోతున్నా రాజు సూటిగా రామచంద్రరావుగారితో మాట్లాడి ఉండలేదు ఇవాళ తనకోసం అతనినుండి పిలుపు వచ్చేసరికి కారణం తెలియకుండానే భయం వేసింది రాజుకి మేడమీదికెళ్ళి, వాలు కుర్చీలో కూర్చున్న రామచంద్రరావుగార్ని చూసి వినయంగా నమస్కరించాడు రాజు.

"కూర్చో అక్కడ" కుర్చీ చూపించారు అతను.

"అక్కర్లేదండి" అని ప్రక్కనున్న స్తంబానికి ఆనుకొని నిలబడ్డాడు

"ఎలాగున్నాయి స్టడీస్?" మొదటగా ప్రశ్నించారు

"బాగానే ఉన్నదండీ" వినయాన్ని సూచించే నవ్వు పెదాలమీద కదులుతుంటే అన్నాడు రాజు

"ఫస్టుక్లాస్ వస్తుందా?"

"అందుకోసమే కృషి చేస్తున్నానండీ!"

"స్టేట్సు కెళ్లాలని ఉందా?"

"స్కాలర్‌షిప్ మీద పంపిస్తే వెళ్లాలనే ఉందండి"

"సరే నీతో ఓ ముఖ్య విషయం మాటాడాలి అలా కూర్చోముందు" అంతవరకూ ఏమీ అనిపించకపోయినా, ఆ మాటలకి మాత్రం గుండె గజగజ వణికింది అతని కెదురు చెప్పలేక కుర్చీని కొంచెం దూరంగా లాక్కొని కూర్చున్నాడు

"నేనో విషయాన్ని అడుగుతాను. సూటిగా సమాధానం చెప్పాలి!" ఆజ్ఞాపిస్తున్నట్టు వినిపించిందతని గొంతు

"అలాగేండి!" ఏం జవాబు ఇవ్వాలో తెలియక అన్నాడు

"తిన్న ఇంటి వాసాలు లెక్క పెట్టే వాళ్ళనేం చేయాలి?" ఆ ప్రశ్న ఆయన నోటినుండి ఎందుకు వెలువడిందో, దానికి ముందు జరిగిన అలజడి ఏమిటో తెలియక పోవటంతో అయోమయ స్థితిలో పడిపోయాడు రాజు

"మాట్లాడవేం రాజూ!"

కొంతసేపు అర్థంకాని పరిస్థితిలో కొట్టుకొని, ఏ సమాధానం చెప్పకుండా ఉండటం బాగుండదని, "ఏమైనా చెయ్యొచ్చునండీ" అన్నాడు.

"అయితే నిన్నిప్పుడేం చెయ్యాలి?"

ఆ ప్రశ్నకి ఆదిరిపడ్డాడు రాజు

"అదికాదండీ. నాకేం..." అని అంటున్న రాజు మీదికి కత్తి విసిరినట్లుగా.

"ఏది కాదు?" అని గర్జించారు,

రాజు ఒంటినిండా చెమటలు పోసాయి చేతుల్లోంచి సన్నని వణుకు ప్రారంభమైంది మనసంతా వికలమైపోయింది

"చిన్న పిల్ల అమాయకురాలు. జీవితం అంటే ఏమో తెలియక ప్రేమా గీమా అని అది ఏదో ఆవేశంగా నిర్ణయం తీసుకుంటే నీకు బుద్ధి వుండనక్కర్లేదూ? లేక నువ్వే దానికి పాయిజన్ ఎక్కించావా?" కళ్ళు ఎర్రగా చేస్తూ గద్గద స్వరంలో రామచంద్రరావుగారు అడుగుతూంటే రాజుకి చెవుల లోంచి వేడి గాడ్పులు చెలరేగాయి ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నా నోట మాట రాలేదు మూగవానిలా అయిపోయాడు.

"నీ తండ్రి చివరి కోరికగా, నీకేలోటు రానివ్వకుండా నిన్ను చదివించి ప్రయోజకుణ్ణి చేదామనుకుంటున్న నాకే నువ్వు ఎసరు పెడదామనుకుంటున్నావా? చెప్పు రాజూ! నువు చదువుకొని, బాగుపడాలని నా కొడుకుల కంటే ఎక్కువగా చూసేనేకాని...నా కూతురి జీవితంలో ఆడుకుంటావనుకోలేదు" అని కళ్లజోడు తీసి టేబిల్‌మీద నుంచారు. దోషిలా తలవంచుకుని నిలుచుండి పోయాడు రాజు అతని కళ్ళు వర్షిస్తున్నాయి అతని గుండె పిండి అయిపోతోంది తల చెక్కలయిపోతోంది ఆవేశమేకాని ఆలోచన ఏమీ లేని నిర్ణయాన్ని తీసుకున్నందుకు తనను తానే నిందించుకోసాగాడు మనసులో రామచంద్రరావుగారు యింకా ఏవేవో అంటున్నారు. రాజుకి అవేమీ వినిపించలేదు

"రాజూ! నీ కాళ్ళు పట్టుకుని బ్రతిమలాడుకుంటాను. 'వాణి'ని నువ్వు మరిచిపో. వాణి నా మాటను వినేటట్టుగా చెయ్ ఆ పని నువ్వొక్కడివే చెయ్యగలవు ఈ ఒక్క విషయంలో మాత్రం నిన్ను నేను అర్థిస్తున్నాను" అని అంటున్న అతని కళ్లనుండిజారి పడిన కన్నీటి బొట్లనుచూసి, అతను అనుభవిస్తున్న మానసిక వేదనని, హృదయ సంక్షోభాన్ని అర్థంచేసుకొని రాజు పూర్తిగా చితికిపోయాడు.

"బాబూ! నేను పొరబాటే చేసాను నా అంతస్థేమిటో తెలుసుకోకుండా ప్రవర్తించాను చేసిన తప్పులకి నన్ను క్షమించండి మీరు పెద్దవాళ్ళు, దిక్కులేని నన్ను చదివించి పెద్దవాణ్ని చేసారు అంతమాట లన






## వెలుగుబాట

కండి తప్పకుండా వాణి మీ మాట వినేటట్లు చేస్తాను. తిన్న ఇంటి వాసాలు ఎక్కతీసినంత కృతఘ్నుణ్ణిగా మాత్రం భావించకండి నిజమే యువక రక్తపు వేడిలో యుక్తాయుక్తాలు తెలియక ప్రవర్తించాను మీకోసం నా ప్రాణాల్నయినా యివ్వగలను'' అని అనుకోకుండానే రామచంద్రరావుగారి పాదాలకు నమస్కారం చేసి లేచి అతని దగ్గర శలవు తీసుకొని మేడ దిగి వెళ్ళిపోతున్న రాజుకి శంకరం పిలుపు విని పించలేదు. ప్రక్కన గదిలోంచి అంతా వింటున్న కృష్ణవేణి పిచ్చిదానిలా అయి పోయింది.

ఆ మరునాడు ఒంటిగంట దాటిపోతున్నా రాజు భోజనానికి రాకపోవటంతో రాజ్యలక్ష్మమ్మ కంగారుపడిపోయి, ''ఏమండీ! రాజు పొద్దున్న కాఫీ టిఫిన్‌కి రాకపోతే చదువుకుంటూ ఉండిపోయాడేమో అనుకున్నాను, ఒంటిగంట దాటిపోతున్నా ఇంకా భోజనానికి కూడా ఇంతవరకూ రాలేదు కబురు చేదామంటే ఎవరూలేరు.'' అని చెప్పింది భర్తతో. రాత్రి జరిగిన సంఘటన ఎలాటి భయంకరాన్ని సృష్టిస్తుందోనని అతనికి కూడా భయంవేసి'' మరి ఉదయమే ఎందుకు చెప్పలేదు?'' అన్నారు

''వస్తాడేమో అనుకున్నాను ''

''సరే. నేను వెళ్ళొస్తానుండు '' అని లేచారు పేపరు పక్కన విసిరేసి. అతని మనసులో రాజు ఏం అఘాయిత్యం చేసాడో నన్న అనుమానం, భయం ఓ ప్రక్క పీకుతున్నాయి

''మీరెందుకు లెండి. రామన్న వస్తే పంపిస్తాను'' అని అంతలో వీధిలోంచి వస్తున్న శంకరాన్ని చూసిన రాజ్యలక్ష్మమ్మ ''ఆ! శంకరం వస్తున్నాడులెండి వాణ్ణి పంపుతాను'' అని ''శంకరం! రాజు ఉదయం నుంచి కాఫీకి కూడా రాలేదు. ఎందుకు రాలేదో ఓసారి చూసిరా. ఇంటి దగ్గ రెఉంటే భోజనానికి వెంటనే పిల్చుకునిరా!'' అన్నది. తరువాత శంకరం వెళ్ళి రాజుని స్కూటరు వెనకాల కూర్చోపెట్టి తీసుకొచ్చాడు. రాజుని చూసిన తరువాత అందరి మనస్సులకూ కొంత ఊరట లభించింది. కాని రాజును చూసిన తరువాత మాత్రం భయం వేయక

(40 వ పేజీ చూడండి)



# ఒకే కథ - రెండు ముగింపులు

## ప్రతాప రవిశంకర

"సరిగ్గా నా జీవితంలో కూడా యిలాగే జరిగింది" చివరివరకూ కాలని సిగరెట్టును యాష్ ట్రేలో పడేస్తూ అన్నారు లాయరు విశ్వనాథం నా కళ్లల్లోకి చూస్తూ. చాలా ఆశ్చర్యమనిపించింది. ఆయన జీవితంలో కూడా యిలాగే జరిగిందా! మెరిసే కళ్లతో కుతూహలంగా ఆయన ముఖంలోకి చూశాను. నా కనులలోని కాంతిని, నా ముఖంలోని ఆశ్చర్యాన్ని, కుతూహలాన్ని గమనించినట్లు ఆయన చిన్న చిరునవ్వు నవ్వారు. రెండు నిముషాలు కనులు మూసుకొని ఆలోచించి ఏదో గుర్తొచ్చినట్లు తల పంకించి మొదలుపెట్టారు నాకేసి చూసి.

"నేను చాలా పేద కుటుంబంలో పుట్టాను. నాకు పదేళ్లున్నప్పుడు అమ్మా-నాన్న ఓ రైలు ఏక్సిడెంటులో పోయారు.

అప్పుడు ఫస్టుఫారం చదువుతున్నాను. నాకు అక్కా చెల్లెళ్లు — అన్న తమ్ములు ఎవ్వరూ లేరు. బంధువులు కూడా ఎక్కువగా లేరు అనాధనైన నన్ను మా మామయ్య తన దగ్గిరికి తీసుకెళ్లాడు. నేనంటే ఆయనకు ఎంతో ప్రేమ. నాకూ ఆయనంటే ఎంతో ప్రేమ, గౌరవం. చదువులో చురుకుగా వుండేవాడిని. పదిహేనేళ్లకే ఎస్సెల్సీ పూర్తిచేశాను. మంచి మార్కులతో పాసైనాను. నాతోపాటే పెరుగుతూ వచ్చింది రమ. అన్నట్టు రమ ఎవరో నీకు తెలీదు కదూ? మామయ్య గుడ్డి కూతురు. అందవికారి. నేనంటే రమకు చెప్పలేనంత ప్రేమ, అభిమానం. కాని రమంటే నాకు ప్రేమలేదు. ఆమెను ఎవరు పెళ్లిచేసుకుంటారా అని రమ భవిష్యత్తును తల్చుకొని జాలిపడేవాణ్ణి. కాని నేనే చేసుకోవాల్సొస్తుందని అనుకోలేదు. బియ్యే పూర్తయిన తర్వాత రమను నన్ను చేసుకోమన్నాడు మామయ్య. ఆయనమాటలు విని నిర్ఘాంతపోయాను. చేసుకోనన్నాను. మరి అనాధనైన నిన్ను చేరదీసి చదువు చెప్పించింది ఎందుకు? అనడిగాడు. మామయ్య నన్ను పెంచింది చదువు చెప్పించింది తన గుడ్డి కూతుర్ని చేసుకోటానికే అని వూహించలేకపోయాను. ఆయన నానుంచి ప్రయోజనాన్ని ఆశించి నన్ను పెంచాడని తెల్సిన తర్వాత ఆయనమీద నాకున్న గౌరవం పోయింది. ఆయనంటే అసహ్యమేసింది. రమను చేసుకోనని చెప్పి ఇంట్లోనించి వచ్చేశాను. మామయ్య నన్ను తిట్టాడు. కృతఘ్నుడనన్నాడు. రమకూడా నన్ను ద్వేషించింది. విశ్వాసఘాతకుడనన్నది. అయినా నేను బాధపడలేదు. నిజమే వారికలాగే వుంటుంది. మొదట్లోనే నన్ను ఈ ఉద్దేశ్యంతో పెంచుతున్నానని ఆయన చెప్పినట్లయితే అప్పుడే ఇల్లువదిలి పోయేవాడిని" అంతవరకు చెప్పి ఆగారు విశ్వనాథం.

నేను మాట్లాడలేదు. మౌనంగా కూర్చున్నాను. ఆయన సిగరెట్‌ను పెదవుల మధ్య పట్టుకొని లైటర్‌తో వెలిగించుకుంటున్నారు.

ఒక్క విషయంలో తప్ప ఇప్పటివరకూ ఆయన జీవితానికీ నాజీవితానికీ ఎటువంటి సంబంధంలేదు. నేను పేదకుటుంబంలోనే పుట్టాను. నాకు తల్లితండ్రి వున్నారు. నాన్న తాలూకా ఆఫీసులో గుమస్తా. మరో ఏడాదిలో ఆయన రిటైరు అవుతాడు. తల్లి జబ్బు మనిషి. ఎప్పుడూ మంచంమీదే వుంటుంది. నాకు పెళ్లికావలసిన ఇద్దరు చెల్లెళ్ళు వున్నారు. ఇతర ఆస్తులేవీలేవు రేపో మాపో పడిపోటానికి సిద్ధంగావున్న ఓ ఇల్లుతప్ప. నేను సంపాదించాలి. చెల్లెళ్ల పెళ్లిళ్లు చేయాలి. తల్లిదండ్రుల్ని పోషించుకోవాలి. నాకు బాధ్యతలు వున్నాయి. కాని ఇల్లువదలి వచ్చేసిన విశ్వనధంగారికి ఎటువంటి బాధ్యతా లేదు.

గట్టిగా పొగపీల్చి మళ్లీ మొదలుపెట్టారాయన.

"ఇంట్లోనించి బయటకు వచ్చేముందు నేను కళావతి విషయం ఆలోచించలేదు. తర్వాత ఆలోచించాను" ఇంకా ఏదో చెప్పబోతూ నాముఖంలోకి చూశారు. కళావతి ఎవరని అడగబోతున్న నేను ఆయనలా చూడటంతో అడగలేకపోయాను. "కళావతి ఎవరని అడుగుదామనుకుంటున్నావు కదూ?" అని అడిగారు. అవునన్నట్లు తలాడించాను.

ఏదో అనుభూతి పొందినట్లు ఫీలయి సన్నగా నవ్వారాయన. ఆయన నవ్వు చాలా విచిత్రంగా వుంది. అందంగావుంది. తమాషాగా నవ్వారాయన. అలా నవ్వినప్పుడు

అయన పెదవులు పొగాయి.

"తొలిసారిగా నాగుండెల్లో ప్రేమదీపాన్ని వెలిగించిన ఆడపిల్ల కళావతి చిరుగాలిలా నాజీవితంలో ప్రవేశించిన అమ్మాయి. ఆ రోజుల్లో నా ఆరాధ్య దేవత. ఆ రోజుల్లో కళావతి లేకుండా నేను లేను. నేను లేకుండా కళావతి లేదు బియ్యే సెకండియర్‌లో నాకు కళావతితో పరిచయమైంది ఇప్పటికీ నాకు బాగా జ్ఞాపకం కళావతితో పరిచయమైనరోజు. ఆ రోజు కాలెజీలో స్త్రీకి విద్య అవసరమా ? అనవసరమా ? అనే అంశంమీద మాట్లాడమన్నారు. చాలా మంది విద్యార్థులు చాలా రకాలుగా తమ తమ అభిప్రాయాలను వెలిబుచ్చుతూ మాట్లాడారు. నేనూ మాట్లాడాను. మొదటి బహుమతి వచ్చింది ఆరోజు కాలేజీనించి తిరిగివస్తుంటే దారిలో నన్ను కలుసుకుంది కళావతి నా ఉపన్యాసం ఆమెకెంతో నచ్చిందన్నది నా ఆదర్శాలకు, అభిప్రాయాలకు ఎంతో విలువ ఇచ్చింది తనవీ అలాంటి అభిప్రాయాలేనట తనపేరు కళావతనీ, తను బియ్యే ఫస్టియర్ చదువుతున్నదనీ చెప్పింది. థాంక్స్ చెప్పి వెళ్లిపోయాను అప్పటినించి తరచు కనిపిస్తూవుండేది కనిపించినప్పుడల్లా నవ్వుతూ మాట్లాడేది కళావతి అందమంతా ఆమె నవ్వులోనే వుంది అంత అందంగా వుంటుంది ఆమె నవ్వు విచ్చుకున్న గులాబీలా— వెన్నెల జల్లులా — కళావతి అందం నన్ను ముగ్ధుణ్ణి చేసేది ఆమెతో మాట్లాడు

# ఒకే కథ రెండు ముగింపులు

తున్నంతసేపూ నన్ను నేను మరిచిపోయే వాడిని నా కూతురుకంటే కూడా అందంగా వుంటుంది కళావతి" చెబుతూ మధ్యలో ఆగిపోయారు విశ్వనాథం వంట మనిషి గాజు గ్లాసులో హార్లిక్స్ కలుపుకువచ్చి టేబుల్ మీద పెట్టి అక్కడే నిల్చుంది తాగగానే గ్లాసు తీసుకువెళ్లటానికన్నట్లు

నాకూ మాధవికీ విచిత్రంగానే జరిగింది పరిచయం మాధవి నా క్లాసుమేటు టెర్మినల్ ఎగ్జామ్స్ అయ్యేవరకూ నాకూ మాధవికీ పరిచయం కాలేదు హాలీడేస్ తర్వాత కాలేజీ తెరిచారు మార్కులు చెప్పారు అన్ని సబ్జక్టులలో ఫస్టు మార్కులు నావే లెక్చర్లందరూ నన్ను పొగిడారు నేనంటే క్లాసులో స్టూడెంట్లందరికీ ప్రత్యేకమైన అభిమానం. మా క్లాసులో మా యింటిపక్క ఇంట్లో అద్దెకుంటున్న ఓ అమ్మాయి వుండేది. ఆ అమ్మాయికీ మాధవికీ స్నేహం నేను కథలు వ్రాస్తానని ఆ అమ్మాయికి తెలుసు. మా ఇద్దరి మధ్య ఓ మాదిరి పరిచయం వుంది ఆ అమ్మాయి మాధవికి నాగురించి చెప్పిందట ఓ రోజు పిక్చరుకెడితే మాధవి, ఆ అమ్మాయి కనిపించారు నన్ను పలకరించింది మాధవి తనకీ కథలు వ్రాయాలనే ఇంట్రస్టు వుందనీ, తనకి కొంత గైడెన్స్ అవసరమని చెప్పింది. నేను వ్రాసిన కథలన్నింటినీ చదివాననీ, బావున్నాయనీ నన్ను పొగిడింది ఎలాగైనా తనని కూడా ఓ రచయిత్రిని చెయ్యమని అడిగింది నేను చాలా అదృష్టవంతుడినని కూడా అన్నది మాధవి.

విశ్వనాథంగారు హార్లిక్స్ తాగి గ్లాసును టేబుల్‌మీద పెట్టారు గ్లాసు తీసుకొని వెళ్లిపోయింది వంట మనిషి కర్చీఫ్‌తో పెదవులను తుడుచుకొని నావైపు చూశారు ఆయన నేనూ ఆయనవైపే చూస్తున్నాను. "నా కథ ఇంట్రస్టింగ్‌గా వుందా" అని అడిగారు, నవ్వుతూ తల వూపాను "లవ్ స్టోరీలు ఇంట్రస్టుగానే వుంటాయి" అంటూ మళ్లీ మొదలుపెట్టారు

"తర్వాత నాకూ కళావతికీ మధ్య ఆకర్షణలు పెరిగాయి రోజుకు ఒక్కసారైనా ఇద్దరం కలుసుకోకుండా నిలవలేక పోయేవాళ్లం. పరిచయం స్నేహంగా, స్నేహం ప్రణయంగా, ప్రణయం పెళ్లివరకూ వచ్చింది ఇద్దరం పెళ్లి చేసుకుందామని అన్నది కళావతి ఓ రోజు మేమిద్దరం సినిమా హాల్లో కల్సుకున్నప్పుడు చేసుకుంటానన్నాను మళ్లీ తనే ఓ సందేహాన్ని వెలిబుచ్చింది కళావతి అదేమిటంటే తన తండ్రి మా పెళ్లికి అంగీకరించడేమోనని. ఎందుకంటే ఆయన గొప్ప ధనవంతుడు. మా ప్రేమ విషయం తన తండ్రితో చెప్పింది కళావతి. నన్ను చేసుకుంటానని కూడా చెప్పిందట. ఆయన నా గురించి వివరాలు తెల్సుకుని నాతో మాట్లాడాలని నన్ను ఆయనను కల్సుకోమని కళావతితో కబురు పంపాడు ఆయన దగ్గరకు వెళ్లటానికి భయపడ్డాను. వెడితే నన్ను తన్ని బయటకు గెంటుతాడేమో అనుకున్నాను భయపడి వూరుకోలేదు కోరుకున్న ఆడదాని కోసం కొండలు పాకటానికైనా సిద్ధపడాలి అందుకే నేను ధైర్యంగా ఆయన దగ్గరకు వెళ్లటానికి నిశ్చయించుకున్నాను"

"విశ్వనాథంగారూ" అంటూ ఎవరో క్లయింట్ రావటంతో ఆయన చెబుతున్నవారల్లా ఆగి "జస్ట్ ఎమినిట్" అని విజటర్స్ రూము వైపు వెళ్లారు. హుందాగా వుంది ఆయన నడక చాలా రీవిగా వుంది ఆయన విగ్రహం ఆరడుగుల ఎత్తు. ఎత్తుకుతగ్గ లావు

విశ్వనాథం గారన్నది నిజం. సరిగ్గా ఆయన జీవితంలో కూడా ఇలాగే జరిగింది. మా ఇద్దరి కథలూ ఒకటే.






# ర్యాలిఫ్యాన్ డీలక్స్. అన్నిటికన్న మేలైనది కావాలనుకుని, దానికి తగిన ధర ఇచ్చే వాళ్ళకోసం ప్రత్యేకంగా డిజైను చేయబడినది.

ర్యాలిఫ్యాన్ డీలక్స్‌లోని ప్రతి భాగమూ సమర్థవంతంగా డిజైను చేయబడి, ఖచ్చితంగా తయారుచేయబడి, పూర్తిగా పరీక్షచేయబడినది అది ఎప్పుడూ ఉన్నతమైన తీరులో పని చేయటంకోసం కొత్తగా ఉన్నప్పుడే కాదు—వేలకి వేల గంటల కొద్దీ పనిచేసిన తర్వాత కూడాను

- అపూర్వమైన 'బ్లేడ్ కాంటూర్' వలన ఎక్కువ గట్టిగా ఉండటమే కాకుండా, సమమైన తీరులో చల్లగా గాలి వీస్తుంది
- ఎంతో వీలుగా బాలన్సు చేయబడిన బ్లేడ్లవలన, మోటారు పైన సరిసమానమైన బరువు పడుతుంది దీనివలన మోటారు ఎక్కువ కాలం నడుస్తుంది
- ఏ కోణంలోనైనా సాఫీగా, నిర్విఘ్నంగా తిరిగేందుకు గాను ఖచ్చితంగా అమర్చబడ్డ ప్రత్యేకమైన స్టాండు.
- తెలివైనది అయిన స్థిరమైన 'బేస్' స్విచ్‌ను పరిశుద్ధపరిచేందుకు గాక్, తేలికగా, ముట్టుకుంటే చాలు పనిచేసే పియానో కీ స్విచ్‌లు
- ఎంచుకోడానికి ఆరు రంగుల్లో ప్రత్యేకమైన స్టౌ ఎనామెలింగ్ మరియు ఇన్‌ఫ్రా-రెడ్ బేకింగ్ పద్ధతితో ఉపరితలాలను పెయింట్ చేయడంవలన, ఏళ్ళతరబడి కొత్తగా కనిపించేలా చేస్తుంది.

అందుకే, మీరు ర్యాలిఫ్యాన్ డీలక్స్‌ను మరికాస్త ఎక్కువ ధర ఇస్తున్నారంటే, నిజానికి మీరు ఉన్నత శ్రేణిలోని నాణ్యతా, ఉత్తమమైన పనివాడితనమూ, శ్రేష్ఠంగా పనిచేసే లక్షణం కొంటున్నారన్నమాట.



## ర్యాలిఫ్యాన్

కాలానికి నిలుస్తుంది—ఎంతో అందంగా

U RTF-17 TEL

తరచు మాధవి నేను కలుసుకుంటూ వుండేవాళ్లం. సాహిత్యాన్ని గురించి గంటల తరబడి మాట్లాడుకునేవాళ్ళం. తను వ్రాస కొచ్చిన కధలను నాకు చూపించేది మాధవి వాటినినేను కరెక్టు చేసేవాడిని. మాధవి వ్రాసిన కదకు ఓ పత్రికలో బహుమతి వచ్చింది. దానితో మాధవికి నామీదవున్న ప్రేమ, గౌరవం రెండింతలయ్యాయి తర్వాత సాహిత్యంతోపాటు మాజీవితాల్ని గురించి మాట్లాడుకోటంమొదలుపెట్టాము మామ్మాటలు పెళ్లివరకు వచ్చాయి. 'మీనాన్న మన పెళ్లికి ఒప్పుకోడేమో' అన్నాను మాధవితో. 'మానాన్నసంగతి మీకు తెలీదు ఆయన తప్పకుండా మనపెళ్లికి అంగీకరిస్తాడు ఆయనకు పేద, గొప్ప భేదాలులేవు. ఆయన సమతావాది' అని చెప్పింది మాధవి. మరురోజు పార్కులో కలుసు కున్నప్పుడు 'మా నాన్నగార్కి మనవిషయం చెప్పాను, ఆయన మిమ్మల్ని చూడాలని మీతో మాట్లాడాలని అన్నారు. రేపు మాఇంటికి రండి' అన్నది మాధవి విశ్వనాధంగారిలాగే నాకూ భయమేసింది. పిల్చి అవమానించి పంపుతారేమోనని భయపడ్డాను కాని మాధవి ప్రోత్సాహకరమైన మాటలవల్ల ఆయనను కలుసుకోవాలనే అనుకొన్నాను.

''విడాకులకేసు. ఎంతత్వరగా తనభార్య తను విడిపోతే అంత మంచిదంటున్నాడు క్లయింట్'' అంటూ నవ్వుతూ వచ్చి తన సీట్లో కూర్చున్నారు విశ్వనాధం ''పెళ్లి కానంతవరకూ కాలేదని గొడవ. పెళ్లయిన తర్వాతనించీ విడాకు 'లిప్పించమని గొడవ జీవితమంటే కలుసుకొని మోజుపోగానే విడిపోవటమేనా'' అన్నారు ఆయన సిగరెట్ వెలిగిస్తూ...

నవ్వుతూ ఆయనకేసి చూశాను.

లైటరు జేబులో వేసుకుంటూ మళ్లీ తన కధను మొదలుపెట్టారాయన.

''కళావలి పిలుపు ననుసరించి ఆమె తండ్రిని కలుసుకోవటానికి వెళ్లాను. అదే మొదటిసారి కళావతి తండ్రిని చూడటం. నాకళ్ళకు పెద్ద విలన్‌లా కనిపించాడు. పెద్దపెద్ద మీసాలు లావుగా పొడుగ్గా వున్నాడు ఆయనను చూడటంతోటే భయమేసింది. ఆయన నన్ను కూర్చోమని అనలేదు అప్పుడే అనుకున్నాను కళావతి నేను విడిపోడం ఖాయమని. నా

గురించీ, నా స్థితిగతుల గురించీ అడిగాడు కంచులా మ్రోగింది ఆయన కంఠం చెప్పాను అంతా విని ''నాకూతురెక్కడ? నువ్వెక్కడ? నా అంతస్థెక్కడ? నీ అంతస్థెక్కడ? నా కూతుర్ని ప్రేమించడానికి, పెళ్లి చేసుకోటానికి నీకున్న అర్హత లేమిటి? నాకూతురెక్కిన కారుకూడా తుడవడానికికూడా పనికిరావు నువ్వు. ఆటువంటి వాడివి నాకూతుర్ని ప్రేమిస్తావా?? పెళ్లికూడా చేసుకుంటానంటావా? నీలాంటివాడికి నాకూతుర్నిస్తానని ఎట్లా అనుకున్నావ్? పెళ్లంటే బొమ్మలాట కాదు. జీవితం. పెళ్ళయిన తర్వాత కేవలం ప్రేమతోటే బ్రతుకు గడవదు భార్యను పోషించుకోవాలి. మామ్మూలుగా పోషించటం కాదు నేను పోషిస్తున్నట్లుగా ధనవంతుడి కూతురిలా ఇంటినిండానౌకర్లు. కారు .బంగళా.. కోరినన్ని చీరలు కోరినన్ని నగలు. ఆడింది ఆట .పాడింది పాట అట్లా పోషించాలి నీకా స్థోమత వుందా? లేదు. అంత స్థోమతు వుండాలంటే నువ్వు ధనవంతుడవై వుండాలి కాదు నువ్వొక బెగ్గర్‌వి నీలాంటి వాడికి నాకూతుర్నిచూసే అర్హత లేదు. మళ్లీ నా కూతుర్ని చూసినా, మాట్లాడినా నీ అంతు చూస్తాను. గెట—

వుట్'' అని గెంటిపారేశాడు బయటకు వచ్చేశాను. ఆయనమీద అంతులేని కోపమొచ్చింది. ఆ క్షణంలో నా చేతిలో ఏ కత్తో. తుపాకో వుంటే ఆయనను చంపేవాడిని. లేదుకాబట్టి ఆయన బ్రతికి పోయాడు. తర్వాత కళావతి నన్ను కలవలేదు ఈ సంఘటన జరిగిన నెల రోజులకు కళావతికి గొప్ప ధనవంతుడితో పెళ్లి జరిగింది. నా గుండె మండిపోయింది. మంట చల్లారిన తర్వాత ఆలోచించాను. కళావతి తండ్రి నన్నలా లవమానించడంలో తప్పులేదనిపించింది అయన ఏన్నడిగిన మాటల్లో అసహజం లేదు నిజమే పెళ్లంటే బొమ్మలాట కాదు జీవితం కళావలినే నేను పెళ్లి చేసుకొని వుంటే ఆమెను పోషించలేను నన్ను పోషించుకునే స్థోమతే నాకు లేదు ఇక కళావతిని ఎట్లా పోషించగలను? అందుకే క్రమంగా కళావతిని మరిచి పోటానికి ప్రయత్నించాను తర్వాత ఓ బుక్ షాప్‌లో గుమాస్తాగా చేరి బి యల్ చదివాను నా జీవితం మారిపోయింది ఆ బుక్‌షాపు యజమాని తన రెండోకూతుర్నిచ్చి నాకు పెళ్లి చేశాడు ప్రాక్టీసు మొదలు పెట్టాను ఏడాది తిరక్కుండానే చేపట్టిన ప్రతికేసులో విజయం సాధించి మంచి పేరు పొందాను నా అదృష్టం మారింది. రోజురోజుకీ క్లయింట్స్ రావటం ఎక్కువయింది. రెండువేల రూపాయలకు తక్కువ ఆదాయం వచ్చే కేసులను త్రిప్పి పంపేవాడిని అలా చాలా సంపాదించాను. ఈ విశ్వనాధం ధనవంతుడయ్యాడు ఆనాటి విశ్వనాంధంకు ఈనాటి విశ్వనాధంకు పోలిక లేదు ఈనాటి విశ్వనాధంకు కళావతిని చేసుకునే స్థోమతుంది కాని వయసు లేదు. 'అవకాశంలేదు ఆనాడు కళావతి వుంది. ధనంలేదు ఈనాడు ధనం వుంది కళావతి లేదు ఇప్పటికీ బాధగా వుంటుంది ఈ ధనమే ఆ రోజుణ వుంటే కళావతి నాదయ్యేదని'' అని చెప్పి కొంచెంసేపాగి మళ్లీ అన్నారాయన.

''ఇక నీ విషయానికొస్తాను. నీ కధ నా కధ ఒక్కటే మరి నా కూతుర్ని చేసుకునే అర్హత నీకు వుందా? నా కూతురు నా యింట్లో సుఖపడినట్లు నీ ఇంట్లో సుఖపడగలదా? నువ్వేంపెట్టి దాన్ని పోషిస్తావు? నీకేముందని దాన్ని సుఖపెట్టగలవు? ఉద్యోగంలేదు, ఆస్తిలేదు, అంతస్థు లేదు, కారు లేదు, రిఫ్రజిరేటరు లేదు, ఏమీ

## ఇంతే సంగతులు

– వీ రా జీ

ఉద్యమం ఊపిరై
ఉరిమే మేఘాన్నడుగు
మెరుపు తీగ లెక్కడని ?

చైతన్యం రెక్కలై
ఎగిరే పులుగు
నడుగు వెలుగెక్కడ
పూస్తుందని ?

అసంతృప్తి వ్యసనమై
మూలిగే మూర్ఖుణ్ణి
అడక్కు బ్రతుకంటే
ఏమిటని ?

ఊబి లాంటి వాడతడు
పడ్డావా అతని చెలిమిలో
అంతే సంగతులు ...

# హార్లిక్స్ ఆరోగ్యం. నాడూ, నేడూ, ఎల్లప్పుడు కూడా.

అంటుంది సుచిత్ర

**హార్లిక్స్ ఆరోగ్యంతో మీ కుటుంబపు భవిష్యత్తు తీర్చి దిద్దుకోండి.**

ఆరోగ్యమే మహా భాగ్యం విజయాలు ఆనందం. ఆరోగ్యంగా వుంటే రోగాలు వుండవు ధైర్యం పెరుగుతుంది

అందువలనే సుచిత్ర, హార్లిక్స్‌ను తన కుటుంబపు జీవనంలో ఒక భాగంగా చేసుకుంది. హార్లిక్స్ కాలా వ్యాధులకు నిలబడుతుందని ఆమెకు తెలుసు.

హార్లిక్స్ ప్రపంచమంతటా డాక్టరు సిఫార్సు చేసేది హార్లిక్స్ ఒక్కటే, అంత ఎక్కువగా సిఫార్సు చేసేది హార్లిక్స్ ఒక్కటే ఎందుచేత నంటే ఇందులోని బలవర్ధకమైన కలిగించే పదార్థాలని అపూర్వమైన హార్లిక్స్ తయారీ పద్ధతి ద్వారా సమ్మిళితం చేయబడ్డాయి

సుచిత్ర మోస్తరుగానే మీరు కూడా మీ కుటుంబానికి ప్రతి రోజు హార్లిక్స్ ఇవ్వండి ముందు ముందు వారు ఎంతో ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"మీరు హార్లిక్స్‌ని నమ్మవచ్చు.
నేను ఎల్లప్పుడు హార్లిక్స్‌నే సిఫార్సు చేస్తాను
అనారోగ్యంగా వున్నప్పుడు త్వరగా వుండటానికి హార్లిక్స్ పుచ్చుకోమని చెబుతాను దీనికి కారణం చాలా స్పష్టమైందే హార్లిక్స్ శుద్ధ పాలు కలిపి వుండడం మాంసకృత్తులు, కార్బోహైడ్రేట్లు, విటమిన్లు ఇందులో చక్కగా కలిసి వున్నాయి. ఇవన్నీ నిత్యం మంచి ఆరోగ్యంగా వుండటానికి సహకారి."





ఒక రూపాయి ఆదా చేయండి. 800 గ్రాం. ఎకానమీ జార్ కొనండి.




**దీనిలో ఆరోగ్యముంది.**

**హార్లిక్స్** మంచి పుష్టికరమైనది హార్లిక్స్ ఒక రిజిష్టర్ ట్రేడ్ మార్కు

Hx-4116 Tel. 1

## ఒకేకథ రెండు ముగింపులు

లేదు, నీలో ఏంచూసి నా కూతుర్నివ్వమంటావ్? నువ్వు రచయితవనా? నీ రచనలు నా కూతురికి అన్నం పెట్టవు. నే నిలా అడుగుతున్నానని నీకు కోపం వద్దు. ఒక ఆడపిల్ల తండ్రిగా అడుగుతున్నాను, నిజంగా నా కూతురు మాధవిని చేసుకునే అర్హత నీకు వుందా?" అని అడిగారాయన నా ముఖంలోకి చూస్తూ.

విస్తుబోయాను ఆయన మాటలు విని. ఆయన నన్ను అలా అడుగుతారని వూహించలేదు, ఊహించని పరిణామం ఆయన ప్రవర్తన ఎంతో సౌమ్యంగా వుంది మొదట్నించి నాతో నవ్వుతూ మాట్లాడారు పైగా నా జీవితంలో కూడా ఇలాగే జరిగిందంటూ తన కథను చెప్పారు ఇలా ప్రవర్తించిన వ్యక్తి నిముషంలో నన్ను ఇలాంటి ప్రశ్నలతో అవమానించారంటే ఆశ్చర్యంగా వుంది అసలు నన్ను ఇన్ని ప్రశ్నలు వేసింది విశ్వనాధంగారేనా అనే అనుమాన మొచ్చింది. వెంటనే మాట్లాడలేకపోయాను, నోట మాట రాలేదు అవాక్కయిపోయాను

కొంతసేపటికి తేరుకున్నాను. ఆయన మీద పట్టరాని కోప మొచ్చింది. మొదట్లో ఆయన మంచి వారని, నిదానస్తులని అనుకున్నాను మాధవి చెప్పినట్లు ఆయనకు పేద, గొప్ప భేదాలు లేవని సమతా వాదని అనుకున్నాను ఆ అంచనా తోటే ఆయనమీది గౌరవాన్ని పెంచుకున్నాను. కాని ఆయన ఇలాంటివారని తనకు జరిగిన అన్యాయమే తను మరొకరికి చెయ్యాలనుకుంటున్నారని తెలిసినపుడు ఆయనమీది కోపం పట్టలేకపోయాను

నాకనులలోకి తీవ్రంగా చూస్తున్నారాయన. కొంచెంసేపు నేనేమీ మాట్లాడక పోవటం చూసి "మాట్లాడవేం" అన్నారు.

"మీరిలాంటివా రనుకోలేదు మీకు జరిగిన అన్యాయమే మీరు నాకు చెయ్యాలనుకోటం న్యాయంకాదు ఇద్దరు ప్రేమికులను అంతస్తు పేరుతో విడదీస్తే వారిహృదయాలు ఎంత గాయపడతాయో, వారెంత కుమిలి పోతారో మీకు తెలుసు ఆబాధ మీరనుభవించారు రేపు నేననుభవించే బాధ ఎటువంటిదో మీకుతెల్సు. ఇన్ని తెల్సికూడా మీరు నన్ను ఇలాంటి ప్రశ్నలతో అవమానించారంటే మీరెలాంటివారో, మీఆదర్శాలెంత గొప్పవో అర్థమవుతోంది ఆరోజు కళావతి తండ్రి అడిగిన ప్రశ్నలకు మీరు జవాబులు చెప్పలేక పోయారేమో. కాని ఈరోజు అవే ప్రశ్నలడిగిన మీకు నేను జవాబులు చెప్పగలను. మీ కూతురికి కాబోయే భర్తకు మీరు అర్హతలు నిర్ణయించారేమో కాని, నాక్కాబోయే భార్యకు నేను అర్హతలు నిర్ణయించుకోలేదు. మీకూతురు మీఇంట్లో సుఖపడినట్లు మా ఇంట్లో సుఖపడకపోవచ్చు కాని ఉన్నదానితో తృప్తిపడితే అంతకంటే ఎక్కువ సుఖపడగలదు. సుఖానికి మితంలేదు ఈరోజు నాకు ఉద్యోగం లేకపోవచ్చు రేపు దొరక్కపోదనే నమ్మకం నాకుంది. ఉద్యోగం దొరక్కపోయినా అడుక్కువచ్చయినా కట్టుకున్నదాన్ని పోషించగల తెలివితేటలు నాకున్నాయి. మీరనుకుంటున్నట్లు జీవితమంటే కారు, రిఫ్రజిరేటరే కాదు. ప్రేమ అనురాగం కూడా వుండాలి. కేవలం కార్లు, రిఫ్రజిరేటర్లు వున్నవాళ్లంతా సుఖపడుతున్నారంటే నేను నమ్మను. నాదృష్టిలో జీవితమంటే విలువైన వస్తువుల వల్ల వచ్చే సుఖంకాదు తనకున్నదానితో తృప్తిపడటంలో వచ్చే సుఖం ఇదే జీవితం. నేను కోరుకునే జీవితం ఇదే మీరంటున్నట్లు కారు, రిఫ్రజిరేటరు లేకపోతే నాకూతురు సుఖపడదు అనుకుంటే మీకూతుర్ని నేను చేసుకోను. ఆ రెండూ వున్నవాడికే ఇచ్చి చేసుకోండి" అని విసురుగా కుర్చీని వెనక్కి నెట్టి చరచరా బయటకు వచ్చాను గేటు దగ్గరకు వస్తుంటే ఆయన పెద్దగా నవ్వడం వినిపించింది. కోపంతో నా పెదవులు అదురుతున్నాయి. ఒళ్లంతా ఆవేశంతో వూగిపోతోంది నమ్మకంగా యింటికి పిలిచి యిన్ని కథలూ చెప్పి చివరికి యిలా చేస్తారా? నన్నూ మాధవినీ విడదీస్తారా?

"మిస్టర్ శివరావ్" ఆయన పిలిచారు వెనక్కి తిరిగి చూశాను. ఆయన నన్ను రమ్మని చేత్తో సైగ చేశారు ఆయనలో ఏదో శక్తి వుంది వెళ్లకుండా వుండలేక పోయాను. మళ్లీ ఏం చెబుతారనో ఆశ. వెళ్లాను "కూర్చో" అన్నారు కూర్చున్నాను.

"నువ్వు నాకంటే తెలివైనవాడివి పట్టుదలగలవాడివి ఒప్పుకున్నాను కేవలం నీ మనసు తెలుసుకోటానికి నేనిలా ప్రవర్తిం

(32వ పేజీ చూడండి)

# ఈ వేసవిలో మీ పిల్లలకు ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది?




ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి. ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది.

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది.
- క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది.
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది.




స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి. అది ఒక్కటే తల్లులు విశ్వసించే ఔషధీయుక్తమైన పౌడరు; చెమట పేలుడు నుంచి ఉపశమనమును కల్గించేది — తక్షణమే.

చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది.

## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.

Johnson & Johnson*



OBM-4316 TEL

# కాలమిచ్చిన తీర్పు

## అన్నపూర్ణ

(గత సంచిక తరువాయి)

### 14

"నామీద ఎలాంటి ఆశలు పెట్టుకోవద్దని" అంత నిష్కర్షగా చెప్పినా విశ్వంమీద కోపం పెంచుకోలేదు సుమ దీనికంతకూ కారకురాలు తన అక్క సుజాత అని ప్రతి చిన్న విషయానికీ ఆమెమీద మండిపడటం మొదలుపెట్టింది

తల్లి దండ్రి చాటయినప్పుడల్లా 'ఒకవేళ నేనెప్పుడైనా బలవంతాన చచ్చిపోతే అందుకు కారకురాలివి నువ్వే అవుతావ్ నన్ను చంపి నువ్వే ఆ విశ్వాన్ని చేసుకొని సుఖపడు' అని సుజాతను నిందిస్తోంది

ఇదో విషమ సమస్యగా తయారయింది సుజాతకు "భగవాన్! ఏమిటి యిది? నతద్రష్టకురాలిగా పుట్టాననుకున్నాను నా జీవితానికి ఎలాంటి ఆనందమూ వుండదు — అలా ఆశించటానికి నాకు అర్హత లేదని గుండె రాయి చేసుకున్నాను కానీ, అనుకోని సంఘటనగా — నన్ను గురించే విశ్వం యీ ఇంటికి వచ్చాడు మోడుబారిన నా జీవిత వృక్షం తిరిగి చిగురిస్తుందని అందరికీ ఆశలు కలిగించావు కానీ, సుమ సొంత అక్కనే! నామీద ఎందుకు దానికి కార్పణ్యం? విశ్వంని మించిన అందగాడు, విద్యాధికుడు తనకు దొరకడా? మరి దేనికి అది నాకు పోటీగా వస్తోంది? ఒకవేళ యిదంతా నీవే కావాలని జరిపిస్తున్నావా? నిజమే! అంతా నీవే కావాలని జరిపిస్తున్నావ్ 'ఎలాంటి సంతోషాలకు నోచుకోని జీవితం నీది' అని పుట్టినప్పుడే రూఢిచేసి పంపావు నన్నీ భూమిమీదికి కానీ, కన్నబిడ్డమీద మమకారం చంపుకోలేక నా తండ్రి నన్ను గురించి ఎంతో తాపత్రయపడ్డారు అందుకు తగ్గట్లే విశాల హృదయుడైన విశ్వం మాకు తారసపడ్డాడు అతడు నన్ను తప్పక చేసుకుంటాడు అతడి భార్యగా నేనెంతో సుఖపడతాను ఇలా జరగటం నీవు గీచిన గీటును మానవులమైన మేము అతిక్రమింపపూనుకోవటమే? అందుకు శిక్షగానే నా విషయంలో సుమ హృదయాన్ని రాయిగా మార్చావు నామీద అసూయ, ద్వేషాలను నీవే దానిలో ప్రేరేపించావు సరే, భగవాన్! నీ ఆజ్ఞప్రకారమే కానీ స్వంత చెల్లెలు సుమ దానిమీద ప్రేమ మమకారాలు తప్ప మరేం లేవు నాలో అది ద్వేషించినా నేను అనురాగిస్తాను దానికంత మక్కువగా వుంటే ఆ విశ్వాన్ని అదే చేసుకోనీ బ్రతికున్నంతకాలం యిలాగే ఒంటరిగా క్రుంగిపోతాను ఇందుకూ ఎవరైనా అభ్యంతర పెడితే ఆనందంగా ఆత్మార్పణ చేసుకుంటాను" అంటూ ఆమె దృఢంగా ఒక నిర్ణయానికి వచ్చింది

విశ్వంమీద కోపం లేకపోయినా యిపుడు సుమ అదివరకులా అతడి గదికి రావటంలేదు అసలు యెక్కువసేపు యింట్లోనే వుండటంలేదు ఆమె

మొత్తానికి సుమ ప్రవర్తనలో వచ్చిన మార్పువల్ల విశ్వం ప్రాణం కొంత తెరిపిన పడింది సాధ్యమైనంతవరకు చదువుకోవటంకోసమే తన సమయాన్ని వెచ్చిస్తున్నాడు ఎప్పుడైనా సుజాత వస్తే ఆమెతో మనసువిప్పి మాట్లాడటానికి ప్రయత్నిస్తున్నాడు

అయితే సుజాత ముఖంలో కొత్తగా కళ రావటానికి బదులు వున్న కాంతే పోతున్నట్లు కనిపిస్తోంది విశ్వానికి తన విషయంలో సుమలా చొరవ తీసుకోలేకపోతోంది — 'ఒకవేళ ఆమె తత్వమే అంత కావచ్చు' అని యెక్కడికక్కడ సరిపెట్టుకొని పోతున్నాడు

పరిస్థితులీ విధంగా వుండగానే ఒకనాడు (ఆరోజు హాలిడేకూడా) సాయంత్రం నాలుగుగంటల సమయంలో — సుమ సుధతో కలిసి బయటికి వెళ్ళతూండడం చూశాడు విశ్వం

ఆ సమయంలో సుబ్బరామయ్య, సుందరి యిద్దరూ లేరు సుందరి ఒంట్లో నలతగావుంటే తనే పనికట్టుకొని ఆమెను హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళాడు సుబ్బరామయ్య

"ఎటు సుధా, బయలుదేరారు?" నోరూడుకోక అడిగాడు విశ్వం ఆనాడు సీతమ్మగారు చెప్పింది మొదలు సుధ అంటే ఒకవిధమైన అపనమ్మకం బయలుదేరింది అతడికి 'వ్యసనాలకు దాసుడైన రమేష్‌తో స్నేహం పాముతో చెలగాటం' అని సుధకు నచ్చచెబుదామని యెప్పటికప్పుడు ప్రయత్నిస్తూనేవున్నాడు విశ్వం కనీసం యీ విషయం సుజాత ద్వారా నయినా సుబ్బరామయ్యగారికి తెలియచేద్దామని ఆరాటపడుతున్నాడు కానీ, సుజాత దేమిటో మౌనభావం — వీలుపడిందికాదు అలా స్వయంగా తనే సుబ్బరామయ్యగారికి చెబితే ఆయన తప్పక నమ్ముతారు కొడుకును సరైన దారిలో పెడతారు కానీ సుధ తనమీద ద్వేషం పెంచుకుంటాడు ప్రతీకారంకోసం యెదురు చూస్తాడు పరాయిచోట వుండే తను ఆ ఇంట్లో వ్యక్తులకే కంటకమైతే? యిక అక్కడ వుండగలడా తను? ఏనాటికైనా సుబ్బరామయ్యగారే సాక్ష్యాధారాలతో సహా సుధను పట్టుకుంటారు నిజం నిప్పులాంటిది బహుకాలం యెక్కడా దాగదు అది — అనే తను ఊరుకున్నాడు

"ఏం మీరూ వస్తారా?" వ్యంగ్యం ధ్వనించింది సుధ కంఠంలో

ఆనాడు రమేష్ విశ్వం తత్వం గురించి చెప్పింది మొదలు సుధ నిజంగానే అతణ్ణి ఒకకంట కనిపెట్టి వుంటున్నాడు ఇపుడు కాదుకానీ, మొన్న మొన్నటి వరకు సుమ, అతడు గంటలతరబడీ మాట్లాడుకోవటం, విరగబడి నవ్వుకోవటం — చాలాసార్లు చూశాడు రమేష్ చెప్పింది నిజమేనన్న నమ్మకం కలిగింది సుధకు విశ్వం మనసు పెద్దక్కమీద కాకుండా చిన్నక్కమీదనే వుందనుకున్నాడు అతడి ఆటలు సాగకుండా చేయాలని అప్పుడే అనిపించింది కానీ, తండ్రిని చూసి ఆగిపోయాడు పెద్దవాళ్ళు వాళ్ళే చూసుకుంటారు అంతా అని సరిపెట్టుకున్నా విశ్వంమీద ఏర్పడ్డ దురభిప్రాయం అతడిలో అలాగే వుండిపోయింది

"రమ్మంటే రాక తప్పుతుందాగానీ, ఎక్కడికి ప్రయాణం?" పట్టు విడువకుండా అడిగాడు విశ్వం

చిన్నక్క పక్కన వుందికదూ? అందుకే తనూ తమవెంట బయలుదేరాలనుకుంటున్నాడు విశ్వం దుర్మార్గుడు!

"ఎక్కడికో అక్కడికి మీకెందుకు?" సుధకు బదులు సుమ అనేసింది అప్పుడామె ముఖంలో కంటే కంఠంలో దర్పం ఎక్కువ

విశ్వం మాటకోసమైనా ఎదురుచూడకుండా ఆ అక్కాతమ్ముడూ విసవిస బయటికివెళ్ళిపోయారు

లోపల సుజాత ఒక్కతి — ఏం చేస్తోందో చూడాలని లోపలికి వెళ్ళాడు విశ్వం

హాలులో టేబిల్‌మీద తల పెట్టుకొని కుర్చీలో కూర్చొనివుంది సుజాత

"ఒంటరిగా ఏం చేస్తున్నావ్ సుజాతా? అలా వరండాలోకి వచ్చి కూర్చోకూడదూ?" అన్నాడు విశ్వం ఆ టేబుల్ దగ్గరిగా వెళ్ళి

సమాధానానికి బదులు వెక్కిళ్ళు వినిపించాయి సుజాత ఏడుస్తోందా? యెందుకు? జాలిగా ఆమె మీద చెయివేశాడు

అతడి చెయ్యి తనమీద పడటం కొత్త అనుభవం సుజాతకు - దానికి తట్టుకోలేకే ఒక్క ఉదుటున లేచి నిలబడింది ఆమె పైగా విశ్వం వైపు అదో మాదిరిగా చూసింది

**జరిగిన కథ:** సుబ్బరామయ్య సుందరిల సంతానం సుజాత, సుమ, సుధాకర్‌లు సుజాత అనాకారితనాన్ని ఏవగించుకునే సుమ, మెడిసిన్ చదవాలని పట్టుబట్టే సుధాకర్‌ల వల్ల కలత చెందుతాడు సుబ్బరామయ్య తన అల్లుడికి వుద్యోగం ఇప్పించమని బాల్యమిత్రుడు రామనాథం సుబ్బరామయ్యని కోర్తాడు సుబ్బరామయ్య చెల్లెలు సీత కొడుకు రమేష్ దుర్వ్యసనాల పాలవుతాడు రమేష్ వ్యాపారానికి కావలసిన అప్పిప్పించటానికి అంగీకరిస్తాడు సుబ్బరామయ్య ఆ యింట్లో రామనాథంచే వదలబడ్డ అనాథ విశ్వం, తన మాట నేర్పుతో అందరికీ చేరువ అవుతాడు అందాలరాశి సుమను వలలో వేసుకోడానికే విశ్వం నాటకమాడుతున్నాడని సుధాకర్‌కు నూరిపోస్తాడు రమేష్ విశ్వాన్ని శంకిస్తారు సుందరి, సుబ్బరామయ్యలు సుజాతను విశ్వంతో సినిమాకు పంపుతాడు సుబ్బరామయ్య రమేష్‌తో తిరుగుతున్న సుధ కూడా చెడిపోకుండా చూడమని విశ్వాన్ని కోరుతుంది సీతమ్మ

ఆ వ్యక్తి 'తనది' అనుకున్నాడు కాబట్టే సుజాత మీద చేయి వేయగలిగాడు కానీ ఆమె ఆ చర్యలను చూశాక తను తొందరపడ్డాడేమో? అని పశ్చాత్తాపపడ్డాడు

"నేను తప్పుగా ప్రవర్తిస్తే క్షమించు సుజాతా" అన్నాడు పైకి

ఏమనుకొందో సుజాత త్వర త్వరగా కళ్ళు తుడుచుకొని,

"పొరబాటుగా మీరేం ప్రవర్తించలేదు నాకే మనసు బాగుండలేదు" అంది

"ఎందుకు నీ మనసును చెదరగొట్టుకోవటం సంతోషంగా కాలం గడపవలసిన సమయంలో నీవిలా బాధపడటం నాకేం నచ్చలేదు సుజాతా!"

నిజమే ఇది తనకు సంతోష సమయమే ఆశలు పెంచుకోవద్దని సుమకు నిష్కర్షగా చెప్పేసి, నేను సుజాతనే చేసుకుతీరతానని స్పష్టం చేశాడు విశ్వం ఏదేమైనా అతడికి తను కాబోయే భార్య అలాంటప్పుడు తనకు విచారపడవలసిన అగత్యమే లేదు పైకి చూసేవాళ్ళకు అందరికీ అలాగే అనిపించవచ్చు కానీ సుమ చాటుమాటున మాట లతో పొడిచి కాలుస్తోంది ఆ బాధకు తను ఎలా తట్టుకు నిలబడగలదు? అదలా అంటోందని ఎవరికి చెప్పుకోగలదు? అలా చెప్పుకోవటానికి అదే మయినా పరాయిదా? స్వంత చెల్లెలు తనకు! అదీ కాక భౌతికంగా సుఖపడే యోగ్యత దానికే ఉంది తనకు లేదు — ఇలా లోలోపల కుమిలిపోతోంది ఆమె

"మీరనుకుంటున్నారే కానీ, నేనేం బాధ పడటంలేదు" అంది సుజాత నటింపుగా నవ్వుతూ

"మరెందుకు కంట నీరు?"

"ఏమిటో — గతం గుర్తుకు వచ్చి" నమ్మకంగా చెప్పింది నిజమే కావచ్చు అనుకున్నాడు విశ్వం

"దాన్ని పూర్తిగా మరిచిపోవటం మంచిది సుజాతా" అని చెప్పి ఇవతలకు వచ్చేశాడు

వరండాలోకి వచ్చేసరికి — విశ్వానికి ఎదురు పడ్డారు సుందరి, సుబ్బరామయ్యలు వాళ్ళను చూసి తన గదిలోకి వెళ్లాడు

కాసేపు అలాగే కూర్చున్నాడు కానీ, మనసంతా అదోమాదిరిగా ఉండి అలా అలా తిరిగి వద్దామని తనూ బయలుదేరాడు విశ్వం

ఫలాని చోటుకు వెళ్దామనుకోలేదు అందుకే అటు తిరిగి ఇటు తిరిగి ఒక బజారుకు వచ్చాడు అక్కడే కృష్ణ ఇల్లు ఉంది

దగ్గరికి వచ్చాంకదా అని వాళ్ళింటికి వెళ్లాడు విశ్వం

నాగలక్ష్మి ముస్తాబై బయట నిల్చొని ఉంది కృష్ణ ఇంటికి తాళం పెడుతున్నాడు

"ఏం విశ్వమన్నయ్యా, బాగున్నావా?" అడిగింది నాగలక్ష్మి

"హాయ్ విశ్వం, సమయానికి వచ్చావే! సరే, సినిమాకు వెళ్దాం పద" అన్నాడు కృష్ణ

"నేను సినిమాకు వచ్చేదీ రాందీ గట్టిగా చెప్పలేను కానీ, మీతోపాటు థియేటర్ వరకు వస్తాను పదండి" అన్నాడు విశ్వం . ముగ్గురూ మాట్లాడుకొంటూ బయలుదేరారు

అయితే, థియేటర్ వరకూ వచ్చాక కృష్ణ మరీ బలవంతం చేసి విశ్వాన్ని సినిమాకు లాక్కు వెళ్లాడు

ఆట మధ్యలో "టీ త్రాగుదాం పదండి" అన్నాడు కృష్ణ "నాకు వద్దు నే నిక్కడే కూర్చుంటాను మీరు వెళ్లిరండి" అంది నాగలక్ష్మి విశ్వం తప్పదన్నట్లే లేచాడు

మిత్రులిద్దరూ టీ త్రాగుతూండగా, "అటు



మాడు విశ్వం!" అన్నాడు కృష్ణ చూశాడువిశ్వం రమేష్‌తోపాటు సుమ, సుధలు!

సుమ ప్రక్కగా నిలబడి ఉంది టీ కోసం రమేష్, సుధ క్యాంటీన్‌వైపు రావటం కనిపించింది

ఆ దృశ్యం చూశాక విశ్వం మనసు గట్టిగా మూలిగింది రమేష్‌తో సుమ భవిష్యత్తును గురించి ఆలోచించిన అతడి హృదయమంతా ఉక్కుకడ్డీతో దేవినట్లుయింది 'పోయి పోయి విషవలయంలో చిక్కుకొంటోందేం సుమ ?'— అనుకున్నాడు

కృష్ణ ప్రక్కగా నిలబడి ఉన్నాడు కనుక విశ్వాన్ని రమేష్‌కానీ, సుధకానీ చూడనేలేదు **అయితే** దూరంగా నిలబడ్డ సుమ మాత్రం అతణ్ణి చూసి తల ఎగరేసింది

సుధ టీ తీసుకువెళ్లి తన చిన్నక్కకు అందిస్తూండగానే విశ్వం కృష్ణతోపాటు అక్కణ్ణుంచీ జారుకున్నాడు

రాత్రి సినిమా అయిపోయాక సుమ, సుధ రిక్షాలో వచ్చారు ఇంటికి వాళ్ళ వెనకే విశ్వం నడిచివచ్చాడు

సుబ్బరామయ్య పైకి ఏమీ అనకపోయినా 'ఆ ముగ్గురూ కలిసే సినిమాకు వెళ్ళినట్టు' గట్టిగా నమ్మాడు సుమ మీద విశ్వానికి ఇంకా ఆశ చావలేదని అతని అంతరాత్మ దృఢంగా పలికింది

## 15

సుబ్బరామయ్య ఆఫీసుకు వెళ్లాడు సుమ, సుధ కాలేజీకి వెళ్లారు సుందరి ఒంట్లో బాగుండక గదిలో పడుకొని ఉంది — బహుశా నిద్రపోతూ ఉండవచ్చు సమయం కనిపెట్టి లోపల వంట చేసుకొంటున్న సుజాత దగ్గరికి వెళ్లాడు విశ్వం

ఎన్నడూ లేనిది — అలా సరాసరి లోపలికి వచ్చి తన ఎదుట నిలబడ్డ అతణ్ణి చూసి బిత్తరపోయి —

# కాలమిచ్చిన తీర్పు

తత్తరపడింది సుజాత

"నీతో ఒక విషయం మాట్లాడాలని వచ్చాను సుజాతా" అన్నాడు విశ్వం

"కూర్చోండి" అని ఒక పీట వేసి, "ఏమిటి?" అని మామూలుగానే అడిగింది సుజాత

"సుమ"

"ఏం చేసింది సుమ ?"

"ఒకళ్ళను చేయటం కాదు తనే తన బ్రతుకును ఏం చేసుకుంటుందోనని నాకు సందేహంగా ఉంది"

"అంటే ? నాకు కొంచెం అర్థమయ్యేలా చెప్పండి"

"చెబుతాను సుజాతా అసలు మీ నాన్నగారికే అంతా వివరించాలనుకున్నాను కానీ, ఆయనతో చెప్పలేకపోతున్నాను నీవయినా ఆయనకు ఈ విషయం తెలియజేయగలిగితే చాలా మేలు కలుగుతుంది మీ చెల్లెలికి"

"ఇంతకూ అదేం చేసిందండీ ?"

"రమేష్‌తో అనుబంధం పెంచుకొంటోంది సుజాతా! అతడు నీకు బంధువే కావచ్చు మరేమయినా కావచ్చు కానీ, ఆ వ్యక్తి నిజస్వరూపమేమిటో నేను కళ్ళారా చూశాను అతడు పిచ్చిగా త్రాగుతాడు విచ్చలవిడిగా తిరుగుతాడు పరాయి స్త్రీలతో పరిచయం అటువంటి ఆ రమేష్‌తో సుధకు స్నేహం సుమ అతడికి దగ్గరవుతోంది రాత్రి వాళ్ళ ముగ్గురూ సినిమా థియేటర్‌లో కనిపించారు మీ చెల్లెలు చివరకు నష్టపోకూడదన్నదే నా తాపత్రయం నా మాటమీద నమ్మకం వుంటే మీ పెద్దలకు చెప్పి ముందుగా జాగ్రత్తపడేట్టు చేయి" అని చెప్పి మరొక్క క్షణం కూడా వుండకుండా తిరిగి వచ్చేశాడు విశ్వం, అక్కణ్ణుంచీ

విశ్వంగారు అబద్ధం చెప్పరు మరి రమేష్ బావ ప్రవర్తన తెలిసివుండీ సుమ అతడితో కలిసి యెందుకు తిరుగుతోంది ? అదివరకు రమేష్ తన యింటికి వచ్చినప్పుడు యేదో మొహమాటానికి మాట్లాడినా అతడితో కలిసి ఏనాడైనా ఇలా తిరిగి యెరుగునా సుమ ? కానీ, ఎందుకో అది కావాలనే చేస్తోంది ఒకవిధంగా తనమీద కక్ష సాధించాలనుకొని తనకు తాను బలైపోతోందేమో ? వీల్లేదు సుమను మందలించాలి తన మాట వినకపోతే నాన్నగారికి చెప్పాలి

తను అనుకున్నట్లే ఆ మధ్యాహ్నం యింటికి వచ్చిన సుమను అడిగింది సుజాత — 'అసలు సంగతేమిటి ?' అని

"నీకు చెప్పవలసిన పనేమిటి నాకు ?" అంది సుమ మండిపడుతూ

"ఏం ? నేనడగటం తప్పా ? నీకు చెప్పటం నామోషా ?" సుజాత కొంచెం గట్టిగానే నిలబడింది

"అవును నేను రమేష్ బావంటే యిష్టపడ్డాను ఇష్టపడ్డ వ్యక్తితో కలిసి తిరిగితే తప్పేమిటి ?"

"బావ అని చెప్పుకోవటానికే సిగ్గనిపించే రమేష్ నీకు నచ్చాడా ?"

"ఏం ? అతడుమాత్రం మనిషికాడా ?"

"రెండు కాళ్ళు, రెండు చేతులున్నంత మాత్రానికే ప్రతివాడూ మనిషవుతాడా ? మనిషన్నవాడికి మనసు వుండాలి సుమా! రమేష్ గత రాత్రి మనకు తెలుసు అతడికి హృదయం లేదు, మనిషి కాడు అని ఏనాడో స్పష్టమయింది ఒకటి కాదు యెన్నో దురలవాట్లు! అటువంటివాణ్ణి నువ్వు యిష్టపడ్డావా ? లేదు నేను నమ్మను అసలిది నీ అంతరాత్మ తీసుకున్న నిర్ణయంకాదు ఏదెందుకో నువ్విలా ప్రవర్తిస్తున్నావ్ వద్దు సుమా! ఆ దుర్మార్గుడి వలలో పడ్డావంటే నువ్వు తిరిగి అందులోంచి బయటపడలేవు నా మాట విను"

"ఏమిటి నీ మాట వినేది ? నేనొకవేళ పతనమైపోయినా — అది నీవల్ల జరిగినట్లే! బావ యెటువంటివాడో నాకు తెలుసు అయినా నేనతణ్ణే కోరుకొంటున్నాను"

"వద్దు సుమా! పెద్దదాన్నో చిన్నదాన్నో నామాట విను ఈ సంగతి నాన్నగారివరకు వెళ్తే ఆయన యెంతో బాధపడతారు ఒకప్రక్క నన్ను గురించే ఇదైపోతున్నారు"

"నిన్ను గురించి యిక ఎవరూ బాధపడవలసిన అవసరం లేదుగా ? ఆ త్యాగశీలుడు నిన్నే పెళ్లి చేసుకుంటానని శపథం పట్టాడుగా ?"

సుమ కంఠం అదోమాదిరిగా మారింది విశ్వాన్ని చేసుకోవాలని ఆమె యెంతగా కాంక్షిస్తోందో సుజాతకు బాగా అర్థమైంది

"త్వరపడకు సుమా! విశ్వంగారు నన్నే చేసుకుంటానని ఏమిటి ? నిన్ను చేసుకోకూడదని యెక్కడ వుంది ?"

# శ్రీ కాళేశ్వర క్షేత్రోద్ధరణ: ఒక విజ్ఞప్తి

శ్రీ కాళేశ్వర క్షేత్రోద్ధరణకోసం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు చేపట్టిన కార్యక్రమాలలో జీర్ణోద్ధరణ నిధి సేకరణ ఒకటి కొంతకాలం కింద 'ఆంధ్రపత్రిక' శ్రీశైల క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి సేకరణలో పాలుగొని కొంత మొత్తం వసూలుచేసి ఆ నిధిని సమర్పించిన సంగతి పాఠకులకి తెలుసు అదే విధంగా శ్రీ కాళేశ్వర క్షేత్రోద్ధరణ నిధి సేకరణలో కూడా 'ఆంధ్రపత్రిక' పాలుగొనాలని ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు సూచించారు వారి సూచన ప్రకారం శ్రీ కాళేశ్వర క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి కోసం చందాలు వసూలు చెయ్యటానికి 'ఆంధ్రపత్రిక' పూనుకొంటున్నది దాతలు తమ విరాళాలను ఈ క్రింద సూచించిన చిరునామాలకి శ్రీ కాళేశ్వర క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి పేర పంప ప్రార్థన పది రూపాయలకి మించిన విరాళాలు పంపిన దాతల పేరు 'ఆంధ్రపత్రిక' దినపత్రికలో ప్రచురింపబడుతాయి అంతేగాక వారికి రసీదులు పంపబడుతాయి భక్తులందరూ యీ పవిత్ర కార్యక్రమంలో పాలుగొని దాన్ని జయప్రదం చెయ్యగలరని నమ్ముచున్నాము

విరాళాలు ఈ క్రింద ఇచ్చిన చిరునామాలలో దేనికైనా అందచేయవచ్చు

**శ్రీ కాళేశ్వర క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి**
**కేరాఫ్ ఆంధ్రపత్రిక**
**బషీర్‌బాగ్, హైద్రాబాద్-500029**

లేక

**శ్రీ కాళేశ్వర క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి,**
**కేరాఫ్ ఆంధ్రపత్రిక గాంధీనగర్**
**విజయవాడ 520003**

లేక

**శ్రీ కాళేశ్వర క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి**
**కేరాఫ్ ఆంధ్రపత్రిక**
**72 తంబుచెట్టి వీధి,**
**మదరాసు 600001**

**సంపాదకుడు,**
ఆంధ్రపత్రిక

"ఎక్కడ వుండాలేమిటి? నువ్వు లేవూ?"

చెల్లెలు ఆమాట అనేసరికి తానింకా ఎందుకు బ్రతికున్నానా అనిపించింది సుజాతకు. ఆవెంట కన్నీరు ఆగలేదు.

"నేను లేకపోతే ..."

అక్క మాటలను ఆలకించలేదు. ఆ కన్నీరు చూశాక అక్కడ మరి వుండలేక వెళ్ళిపోయింది సుమ, హాలులోకి.

ఆ సాయంత్రం సుమను గురించి చెబుదామనే తండ్రి గదిలోకి వెళ్ళింది సుజాత.

కానీ, అక్కడివరకు వెళ్ళాక ఆ ప్రస్తావన ఎలా తేవాలో బోధపడలేదు ఆమెకు.

"ఏమిటమ్మా ఇలా వచ్చావ్?"

చెప్పవలసింది తోచక తికమకపడింది.

"సుధ సంగతి నాన్నగారూ" అనేసింది అనుకోకుండా.

"ఏం చేశాడు? నిన్నేమైనా అన్నాడా వాడు?"

"నన్ను అనలేదు. కానీ, నాన్నగారూ, వాడు రమేష్‌బావతో కలిసి తిరుగుతున్నాడుట."

"ఓస్ ఇంతేనా?" అన్నట్లు ముఖం పెట్టి ఊరుకున్నాడు.

స్వంతంగా బుక్ స్టాల్ పెట్టి దాన్ని నడుపుతున్నది మొదలు రమేష్ అంటే ఒక విధమైన సదభిప్రాయమే ఏర్పడింది సుబ్బరామయ్యకు. 'స్వయంగా ఉపాధి కల్పించుకోవాలని అతడిలో ఆలోచన కలగటమే గొప్ప. వెనకటి ప్రవర్తనలో కొంత కాకపోతే కొంత మార్పు లేనిదే అదెలా సంభవమవుతుంది? రమేష్ మారాడు. ఇక ఇపుడు అతడితో సుధ స్నేహం చేసినా అది వాడి భవిష్యత్తుకేం చెరుపు లేదు. అయినదానికీ కానిదానికీ అదుపులో పెట్టాలని చూస్తే — అసలే మతి చెదరిఉన్న సుధ మరోలా ఫీలవుతాడు. ఏదో కొంత కాలంపాటు వాడి ధోరణిలో వాణ్ణి తిరగనీ' అని సరిపెట్టుకున్నాడు అతడు.

సుబ్బరామయ్యది అదొక తత్వం. తన ఆఫీసేమో, తన పనేమో — ఆఫీసు నుంచీ సరాసరి ఇంటికే వస్తాడు. మళ్ళీ బయటికి వెళ్ళడు. ఇంట్లోకి వెచ్చాలు కావాలంటే వెంకన్న తెచ్చిపెడతాడు. ఏమయినా షాపింగ్ చెయ్యాలంటే సుందరి వెళ్తుంది. అందుకే అతడికి ఆ ఊళ్ళో సంగతులు తెలియవు. అలాగే తన మేనల్లుడి ప్రవర్తన అతని దాకా రావటంలేదు.

"పోనీలే అమ్మా. కొంత కాలంపాటు వాణ్ణి ఎలాగోలా తిరగనీ. ఒక పక్క మెడిసిన్ చదవలేక పోతున్నందుకే లోలోపల బాధపడుతున్నాడు. ఇపుడు నేనేమైనా అంటే మనసు చిన్నపుచ్చుకుంటాడు" అన్నాడు సుబ్బరామయ్య పైకి.

సుజాతకు ఇంకేమనాలో తోచలేదు.

మళ్ళీ ఏదో అనుమానం వచ్చి అడిగాడు సుబ్బరామయ్య.

"విశ్వం నువ్వు కనిపిస్తే — మాట్లాడుతున్నాడా?"

"మాట్లాడుతూనే ఉన్నారు నాన్నా."

"ఈ ఎండాకాలంలోనే మీకు పెళ్ళి చేసేద్దామనుకుంటున్నానమ్మా. ఎలాగో ఒక నెల రోజుల్లో విశ్వం పరీక్షలైపోతయ్‌కద?"

"మీ ఇష్టం నాన్నా" అని చెప్పి అక్కణ్ణుంచీ వచ్చేసింది.

మర్నాడు సుజాత కనిపించినప్పుడు విశ్వం మళ్ళీ అడిగాడు.

"సుమను గురించి మీ నాన్నగారికి చెప్పావా?"

"చెప్పాలనే వెళ్ళాను. కానీ, ఆయనతో ఎలా చెప్పాలో తోచలేదు. సుధ సంగతి మాత్రం చెప్పాను."

"ఏమన్నారు?"

"కొంత కాలంపాటు వాడెలా తిరిగినా పట్టించుకోనన్నారు."

"రమేష్ నిజస్వరూపం మీ నాన్నగారికి తెలిసుండదు."

"ఏమో" ఆ ప్రస్తావనను అంతటితో ఆపేసింది.

విశ్వం మనసంతా మొద్దుబారినట్లయింది.

## 16

ఒక నెలరోజులు అలాగే గడిచాయి.

విశ్వం పోయిన పార్టులు పరీక్ష వ్రాశాడు. బి.ఎ. సెకండియర్‌లో వున్న సుమ పరీక్షలుకూడా అయిపోయాయి. బి.ఎస్‌సి. మొదటి సంవత్సరమే కనుక సుధ పరీక్షలు అంత లెక్కలోనివి కావు.

ఆ తర్వాత వున్నట్లుండి రామనాధాన్ని పిలిపించాడు సుబ్బరామయ్య.

అతడు వచ్చాక సుజాత పెళ్ళి విషయం ప్రస్తావించి, "సాధ్యమైనంత త్వరలో ఈ పెళ్ళి చేసేయాలనుకుంటున్నాను. మరి విశ్వం అభిప్రాయమేమిటో కనుక్కోరా రామనాధం" అన్నాడు సుబ్బరామయ్య.

"ఈమాత్రం దానికి నన్ను పిలవటం దేనికిరా? నువ్వే విశ్వాన్ని అడిగి — ఆ ముహూర్తమేమిటో నిశ్చయించి నాకు తెలియబరచకూడదూ? అతడేమయినా నీ మాట తీసేసేవాడా?" అన్నాడు రామనాధం.

"రామనాధం! నీకు సర్వీసు వుండేకొని అనుభవం తక్కువరా. ఏదైనా 'త్రూ ప్రాపర్ ఛానల్'గా పోతేనే విలువ, మర్యాద. విశ్వం మా సుజాతను చేసుకుంటానన్నాడు. ఇది తెలియకనేనా నిన్ను సలహా అడుగుతోంది? నా మాట అతడు వినడనేనా నిన్ను సలహా అడుగుతోంది? కాదురా. యేదైనా శుభకార్యం జరిగేటప్పుడు 'నా' అనేవాళ్ళు పక్కనుండాలి. అప్పుడే నిండుగా వుంటుంది. విశ్వానికి యెవరూ లేరు. కానీ, ఆ భావనకు అతడిలో చోటివ్వకూడదు. అందుకే నిన్ను రప్పించాను."

"సరే. నీమాట ప్రకారమే కానిద్దాం. అయితే నన్ను త్వరగా పంపించివెయ్యాలి. పెళ్ళికి నాలుగు రోజులు ముందుగానే వస్తాలే."

"నువ్వు రావటం సరేకానీ. యింకో ముఖ్య విషయం వుందిరా."

"ఏమిటది?"

"సుజాత విషయంలో విశ్వం అభిప్రాయం మరోసారి అడగాలి. ఎందుకంటే పెళ్ళి — అది మామూలు విషయం కాదు. నూరేళ్ళపంట."

"లోగడే చెప్పాడుకదరా? అసలు క్షణ క్షణానికి మారేదికాదు విశ్వం మనస్తత్వం. నాకు తెలుసు."



"అదికాదు. నా మాట విను రామనాధం! అతణ్ణి మరోమారు అడగాలి. కేవలం నాతృప్తికోసం."

"సరే. చాటుగ యెందుకు? ఆ అడిగేదేదో నీ యెదటే అడిగేస్తానుండు" అని వెళ్ళి విశ్వాన్ని పిలుచుకువచ్చాడు రామనాధం.

"విశ్వం! సుజాత విషయంలో నీ ఖచ్చితమైన అభిప్రాయం అడుగుతున్నాడు సుబ్బరాముడు. ఏమంటావ్?"

"ఏనాటికీ నా అభిప్రాయం ఒకటే మామయ్యా!" నిండుకుండలా సమాధానమిచ్చాడు విశ్వం.

సుబ్బరామయ్యకు అప్పటికీ అనుమానమే. సుజాతను చేసుకుంటాననటం పైపై మాటే. అతడి అంతరాత్మలో మాత్రం సుమను చేసుకోవాలని వుంది. అందుకే దానితో చొరవగా ఉంటున్నాడు.

ఆనాడు సినిమానుంచి సుమ, సుధ — వాళ్ళ వెనకే విశ్వం రావటం చూశాక "ఇంకా విశ్వం సుమను వదులుకోలేకుండానే వున్నాడు. అదివరకులా పబ్లిక్‌గా కాక చాటుమాటు వ్యవహారాలు సాగిస్తున్నాడు" అని గట్టిగా నమ్మాడు.

దాని లోగుట్టు యీనాటికీ సుబ్బరామయ్యకు తెలియదు.

"అలా చెప్పకు విశ్వం. వాతావరణాన్నిబట్టి వాంఛలు పుడుతూంటాయి. కాలాన్నిబట్టి మనసులు మారుతూంటాయి. అలాగే వయసునుబట్టి అభిప్రాయాలు వేరవుతూంటాయి. మనిషిలోని ఈ పరిమార్పులు కూడదనటంలేదు. సహజమంటున్నాను" అన్నాడు సుబ్బరామయ్య.

ఇంత తెలియచెబుతున్నా తనమీదింకా ఆయనకు గురి కుదరకపోవటం తన దురదృష్టం అనుకున్నాడు విశ్వం.

'వాళ్ళిద్దర్నే మాట్లాడుకోనీ' అన్నట్లు ఊరుకున్నాడు రామనాధం.

(30వ పేజీ చూడండి)

# * సినిమా విశేషాలు *



'ప్రేమమందిరం' లో కృష్ణంరాజు, భారతి

## మదరాసులో మృత్యుంజయుడు

మృత్యువును జయించి, మరుజన్మ ధరించిన అక్కినేనిని మృత్యుంజయుడు అనడం భావ్యమే. కొత్త రక్తం ప్రవహిస్తున్నది నిజంగాబట్టే, కొత్త భారాన్ని (స్టుడియో) క్షేమంగా నిర్వహించ గలిగారు.

రోజుకు పదహారు గంటలు యాక్టివ్‌గా యిప్పటికీ పని చేస్తున్న అక్కినేని ఏప్రిల్ ఒకటి నాటికి ఒప్పుకున్న చిత్రాలు యిరవైకి ఒక్కటి తక్కువ.

మార్చి యిరవై ఆరు నుంచి ఏప్రిల్ అయిదు వరకు నాగేశ్వరరావు మదరాసులో వున్న సమయాన, ఆయన చేసిన పనులు.

[''సెక్రటరీ''కి డబ్బింగ్ చెప్పడం, ''సన్యాసి రాజా'' కథపై విక్టరీతో చర్చించడం, పి. ఎ. పి. జగపతి వాళ్లకు, కృష్ణవేణికి కాల్‌షీట్లు యివ్వడం, ''మహాత్ముడు'' డ్రస్ ట్రయిల్ చూడడం.]

### మనవరాలు పుట్టింది

''నటసమ్రాట్''గారి జ్యేష్ఠ పుత్రిక అమెరికాలో నివసిస్తున్నారు. ఆమెకు మార్చి 12వ దబ్బపండులాంటి కుమార్తె పుట్టింది. తల్లి... బిడ్డ ఆరోగ్యంగా వున్నారు. అక్కినేని మరోసారి తాత అయ్యారన్న మాట. మనవడు చిరంజీవి సుమంత్ నాగేశ్వరరావు... అన్నపూర్ణమ్మగార్లవద్ద పెరుగుతున్నాడు.

తన మనవడు మహానటుడు అవుతాడన్న నమ్మకం అక్కినేనికి వుంది.

### కొత్త చిత్రాల షూటింగు

రామానాయుడుగారి ''సెక్రటరీ'' చిత్ర నిర్మాణం పూర్తయింది. ఏప్రిల్ ఆరు నుంచి మే 15 వరకు ''మహాత్ముడు'' షూటింగులో పాల్గొంటారు.

మే 16న అమెరికా వెళ్తారు. జూన్ మొదటి వారంలో స్వదేశానికి వస్తారు. జూన్ 15 నుంచి ఊటీలో ''మహాత్ముడు'' పాటల చిత్రీకరణలో పాల్గొంటారు.

### రామారావుగారి చిత్రం

జులై నుంచి వరుసగా మూడు మాసాలు (జులై, ఆగస్టు... సెప్టెంబర్) 'నటరత్న'గారి 'చాణక్య... చంద్రగుప్త'కు 45 రోజులు పని చేస్తారు. ప్రతి నెలా పక్షం రోజు లన్నమాట.

ఆగస్టు నుంచి నెలకు 15 రోజులు చొప్పున ''చక్రధారి''కి పనిచేస్తూ, జగపతివారి ''బంగారు బొమ్మలు'', శ్రీనివాసా ఏజెన్సీస్‌వారి 'సన్యాసిరాజా' ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి కొత్త చిత్రం కోసం తేదీలను కేటాయించారు.

ఏప్రిల్ చివరి రోజున లక్షలాది ప్రేక్షకులు తియ్యని ఆశలను పెంచుకున్న ''సెక్రటరీ'' చిత్రం విడుదలవుతుంది. తర్వాత సెప్టెంబరు యిరవైన అంటే అక్కినేనిగారి జన్మదినాన ''మహాత్ముడు'' విడుదలవుతుంది.

సంక్రాంతికి ''చాణక్య... చంద్రగుప్త, ఫిబ్రవరికి చక్రధారి, మార్చికి బంగారు బొమ్మలు'' విడుదలయ్యే విధంగా అక్కినేని ప్లాన్ చేసుకున్నారు.

### వచ్చే ఏడు లాబ్ రెడీ

విఖ్యాత చిత్ర నిర్మాత, దర్శకుడు ఎల్. వి. ప్రసాద్‌గారితో కలిసి తలపెట్టిన కలర్ లాబ్ వచ్చే ఏడు రెడీ అవుతుందన్న వార్తను అక్కినేని చెప్పారు.

అన్నపూర్ణా స్టుడియోస్‌లో తన చిత్రాలకే గాక, తదితరులకు కూడా అవకాశం వుంటుంది అని అక్కినేని వివరించారు.

తనకు...రామారావుగారికి కుదిరిన ''చాణక్య–చంద్రగుప్త'' స్నేహం ప్రేక్షకులకు అమితానందాన్ని కలిగిస్తున్న నిజాన్ని, అభిమానులు రాసే ఉత్తరాలు స్పష్టపరుస్తున్నాయి, అన్నారు 'నటసమ్రాట్.'





''నటరత్న'' చిత్రంలో అక్కినేని నటిస్తున్నట్టే, 'నటసమ్రాట్' నిర్మించే చిత్రంలో నందమూరి ప్రధాన పాత్ర పోషించే మంచిరోజు దూరానలేదు.

### ఒకే చిత్రంలో ముగ్గురు ప్రతిభావంతులు

''ప్రేమాయణం'' చిత్రాన్ని పూర్తిచేసిన ముప్పలనేని శేషగిరిరావు జనవరి తొమ్మిదిన అక్కినేని అంగీకారాన్ని పొందారు.

శ్రీనివాసా ఏజన్సీస్ తలపెట్టిన రెండవ చిత్రంలో ''నటసమ్రాట్'' ఒక విశిష్టమైన పాత్రను పోషిస్తున్నారు. అక్కినేని కథానాయకుడుగా నటిస్తున్న ఆ చిత్రంలో 'ఊర్వశి' శారద, 'కళా వాచస్పతి' జగ్గయ్య ముఖ్య పాత్రలను పోషించగల రని, నిర్మాత శేషగిరిరావు చెప్పారు.

నవంబరు, డిశంబరు నెలల్లో అన్నపూర్ణా స్టుడియోస్‌లో షూటింగు జరుగనున్న శ్రీనివాసా ఏజన్సీస్ చిత్రానికి ఆచార్య ఆత్రేయ, మహాదేవన్ సాహిత్య, సంగీతాలను సమకూర్చగలరని, విక్టరీ మధుసూదనరావు దర్శకత్వాన్ని నిర్వహిస్తారని, చెప్పారు.

### సెప్టెంబర్ నుంచి బంగారుబొమ్మలు

జగపతి ఆర్ట్ పిక్చర్స్ విదేశాల్లో నిర్మించ దలచిన ''బంగారుబొమ్మలు'' వర్ణ చిత్రం షూటింగు స్వదేశంలోనే జరుగగలదని, నిర్మాత... దర్శకుడు వి. బి. రాజేంద్రప్రసాద్ చెప్పారు.

భారత ప్రభుత్వం విదేశాల్లో చిత్రనిర్మాణం చెయ్యకూడదని ఆంక్ష విధించింది. ''బంగారు బొమ్మలు'' చిత్ర కథను తదనుగుణంగా మార్చి, సెప్టెంబర్ నుంచి షూటింగు జరపడానికి జగపతి అధినేత నిర్ణయించారు.

''బంగారుబొమ్మలు'' చిత్రానికి ఆచార్య ఆత్రేయ, వెంకటరత్నం, మహాదేవన్, సంజీవి

'మగాడు' లో మంజుల, రామారావు



ముఖ్య సాంకేతిక సాధకులు. కథ, చిత్రానువాదం, దర్శకత్వంను వి. బి. రాజేంద్రప్రసాద్ నిర్వహిస్తారు.

అక్కినేని ... మంజుల శృంగార జంటగా నటించే "బంగారుబొమ్మలు" చిత్రంలో సహాయ పాత్రలను సమర్థులైనవారే పోషిస్తారు.

**సురేష్ అధినేత కార్యక్రమం**

ఉత్తమ చిత్రాల నిర్మాత, ప్రజలు మెచ్చిన నిర్మాత, సురేష్ అధినేత అగు రామానాయుడుగారిని, వారింట కలిశాను. ఆ రోజున, అక్కినేని ఆయన యింట వున్నారు.

మీ భవిష్యత్కార్యక్రమం ఏమిటి అని ప్రశ్నించాను.

"సెక్రటరీ"ని ఏప్రిల్ 30 న విడుదల చేసి, "సోగ్గాడు" చిత్రాన్ని హిందీలో "సెక్రటరీ"ని శివాజీతో తమిళంలో నిర్మించిన తరువాత, అక్కినేనిగారు కాల్‌షీట్లు యిస్తే, తెలుగు చిత్రాన్ని నిర్మించడం, అన్నారు.

పక్కనే వున్న నాగేశ్వరరావుగారు "అలాగే చెయ్యగలవాడను" అని సురేష్ అధినేతకు హామీ యిచ్చారు.

ఈ మధ్య కాలంలో "శాంతి నికేతన్" నిర్మించగలరేమో!

**"మగాడు" ఎన్టీఆర్**

"దీవార్" చిత్రం ఎంతటి విజయాన్ని చవి చూచిందో ప్రేక్షకులకు తెలుసు. తెలుగు చిత్ర కథావస్తువు హిందీలోనే ఘన విజయాన్ని సాధించి నప్పుడు, అదే చిత్రం తెలుగులో అద్వితీయ విజయాన్ని సాధించడం తథ్యమేగా.

ఎదురులేని కథానాయకుడు, హిట్ చిత్రాల నాయకుడు మన ఎన్టీఆర్‌కు మహోన్నత విజయాన్ని తెచ్చిపెట్టే చిత్రం "మగాడు".

రాజ్యం ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న "మగాడు" వర్ణ చిత్రం "మే... డే" వాడు విడుదలవుతుంది. మరో "మే... డే" వరకు "మగాడు" విజయయాత్ర చెయ్యగలడేమో అనిపిస్తుంది.

"పగ... ప్రతీకారం... మానవతావాదం" అనెడి అంశాలపై "మగాడు" చిత్రం అడుగడుగునా వుద్వేగంతో, వుత్సాహంతో పరుగిడుతుంది.

**లాల్‌కు మరో హిట్!**

"నిప్పులాంటి మనిషి, అన్నదమ్ముల అనుబంధం" చిత్రాల విజయసారధి ఎస్. డి. లాల్‌కు "మగాడు" చిత్రం మరింత కీర్తిని ఆర్జించిపెడుతుంది. ఈ చిత్రానికి డి. వి. నరసరాజుగారి కలం ఎంత బలాన్ని చేకూర్చిందో, మహదేవన్ సంగీతం అంత వెయిట్‌ను యిచ్చింది.

తల్లిగా అంజలీదేవి నటన 'ఎ' వన్. మరో ముఖ్య పాత్రను పోషించిన రామకృష్ణ నిగ్రహంగా నటించారు. సహాయ భూమికలను ప్రభాకరరెడ్డి, కాంతారావు, ముక్కామల, త్యాగరాజు, రాజనాల, కె. వి. చలం, సత్యేంద్రకుమార్, మంజుల, లత, జయమాలిని ధరించారు.

నిర్మాతలు శ్రీధరరావు... లక్ష్మీరాజ్యం, శ్రీకాంత్ నహతాగార్లకు "మగాడు" కనకవర్షాన్ని కురిపిస్తాడు.

ఎన్టీఆర్ అభిమానులు... ఎ. ఎన్. ఆర్. అభిమానులు స్నేహితులు అయిన శుభ సంఘటన "మగాడు" చిత్రానికి ఎడిషనల్ అడ్వాంటేజ్ అవుతుంది.



'మాయావి'లో చిట్టిబాబు, పొట్టిప్రసాద్

**'నటరత్న' వితరణ**

రామకృష్ణ సినీ స్టుడియోస్‌లో ప్రారంభమయ్యే మొదటి చిత్రం "చాణక్య... చంద్రగుప్త". తన స్టుడియోలో బ్రదర్ నటించే చిత్రం మొదటి చిత్రం కావాలని రామారావుగారు ఆశించడం, ఆయన కోరికను "నట సమ్రాట్" అవుననడం చిత్ర పరిశ్రమలో పెద్ద మార్పును తెచ్చిపెట్టింది. వీరిద్దరి కలయిక కొందరికి భయాన్ని కలిగించిన మాట నిజమే.

"చాణక్య... చంద్రగుప్త" స్క్రిప్టును అక్కినేనికి యిచ్చి, పాత్ర ఎంపిక నాగేశ్వరరావుగారికి యిచ్చారు, నటరత్న. నందమూరి యిచ్చిన స్క్రిప్టును అక్కినేని చదివి, అద్భుతంగా వుందని ప్రశంసించారు. చాణక్య పాత్రను ఎంపిక చేశారు.

టైటిల్స్‌లో, లైటప్స్‌లో అక్కినేనిగారికే ప్రాధాన్యత, ప్రాముఖ్యత వుంటుందని రామారావుగారు చెప్పారు.

**ఆనందానుభూతి!**

బ్రదర్ నాగేశ్వరరావుగారు తన చిత్రంలో ముఖ్య పాత్రను అంగీకరించినందుకు, రామారావుగారు ఆనందానుభూతిని అనుభవించారు. కారణజన్ములయిన మహా నటులిద్దరు గురు... శిష్యులుగా (చాణక్య... చంద్రగుప్తులుగా) నటించడం పెద్ద విశేషమేగా!

**సోగ్గాడు వందరోజుల వైభవం**

సురేష్ రామానాయుడుగారికి "బంగారు పంటను" "సోగ్గాడు" పండించాడు. ఇటీవల యింతటి విజయాన్ని మరే చిత్రం చవిచూడ లేదేమో!

"సోగ్గాడు" వందరోజుల వైభవం ఏప్రిల్ 11 న జరుగగలదని, నిర్మాత రామానాయుడు చెప్పారు. పది+ఎనిమిది కేంద్రాలలో యీ శతదినోత్సవ వైభవాన్ని "సోగ్గాడు" అనుభవిస్తున్నాడు.

అఖండ విజయాన్ని సాధించిన "సోగ్గాడు" చిత్రాన్ని హిందీలో రాజేష్‌ఖన్నా చూచి, ముగ్ధుడై కాల్‌షీట్లు ఏ క్షణాన అడిగినా, యివ్వగలనని హామీ యిచ్చారట.

సురేష్ సంస్థలో "రాముడు ... భీముడు" చిత్రం లగాయితు, యిప్పటివరకు వివిధ శాఖలను నిర్వహిస్తున్న పనివారలు తమ యజమానికి కృతజ్ఞతలు తెలపడానికి ఒక అభినందన సభను ఏర్పాటు చెయ్యబూనడం ముదావహం.



'మహేశ్వరి మహాత్మ్యం' లో కె ఆర్ విజయ

రామానాయుడుగారు తన సంస్థలో పనిచేసే వారిని భాతృవాత్సల్యంతో, మిత్రప్రేమతో ఎప్పటి కప్పుడు వారి ఆత్మీయతను, ఆప్యాయతను చూర గొంటున్నారు

''సోగ్గాడు'' శతదినోత్సవం జరిగే అదేరోజున, అదే వేదికపైన తమ యజమానిని ఘనంగా, ప్రేమపూర్వకంగా సన్మానించడానికి సురేష్ యూనిట్ నిర్ణయించినట్టు, ప్రముఖ రూపశిల్పి పోతరాజు చెప్పారు

ఇలాంటి మంచి కార్యాన్ని చెయ్యబూనిన సురేష్ యూనిట్‌ను అభినందిస్తూ, యజమాని కార్మికుల సంబంధం చిత్ర చిత్రప్రవర్ధమానం కావాలని కోరుకుందాం

## శోభన్ ధరిస్తున్న కొత్త పాత్రలు

రోజూ వంద వుత్తరాలు వస్తాయి శోభన్ బాబుకు అభిమానులు రాసే వుత్తరాల్లో అందరూ కోరేది ఒక్కటే సంవత్సరానికి ఒక పౌరాణిక చిత్రంలో నటించాలన్నదే వారి కోరిక

తన్ను ప్రేమిస్తున్న ప్రేక్షకుల కోర్కెను గౌరవించడం శోభన్‌కు బాగా తెలుసు అందుకే, యికపై సంవత్సరానికి ఒక పౌరాణికమో లేక జానపదమో చెయ్యడానికి నిశ్చయించారు

## ఏకలవ్యుడు కృష్ణుడు

మహాభారత గాథలో ప్రముఖ పాత్ర వహించిన ఏకలవ్యుడు, కృష్ణుడు యొక్క తెరరూపాన్ని శోభన్ చెయ్యడానికి వొప్పుకున్నారు

శ్రీ లక్ష్మీ నరసింహా ఫిలింస్ తలపెట్టిన ''ఏకలవ్య'' వర్ణ చిత్రానికి దాసరి దర్శకుడు ఆరుద్ర రచయిత మావుళ్లయ్య, రామతారకం, భాస్కరరావు నిర్మాతలు

మాధవీ పద్మాలయా కంబైన్స్ నిర్మిస్తున్న ''కురుక్షేత్రం'' వర్ణ చిత్రానికి కమలాకర కామేశ్వర రావు దర్శకుడు ఆరుద్ర రచయిత ఆంజనేయులు, రాజేంద్రప్రసాద్ నిర్మాతలు

# సినిమా

''కురుక్షేత్రం''లో అర్జునుడు పాత్రను కృష్ణ పోషించడం ముదావహం నరనారాయణులుగా కృష్ణ, శోభన్ కొత్త చరిత్రను సృష్టించగలరు

## మిష్టర్ సంపత్!

ఎం ఏ గా హీ–మాన్ నటిస్తున్న వర్ణ చిత్రాన్ని నిర్మాత ఎ హనుమంతరావు జూన్‌లో ప్రారంభిస్తున్నారు ప్రముఖ రచయిత్రి మాదిరెడ్డి సులోచనగారి నవలను అదే పేరుతో చిత్రంగా విజయ చిత్రాల దర్శకుడు మధుసూదనరావు దర్శకత్వాన్ని, వెంకటరత్నం ఛాయాగ్రహణాన్ని, చక్రవర్తి సంగీతాన్ని నిర్వహించే ''మిష్టర్ సంపత్ ఎం ఏ'' చిత్రానికి ఆచార్య ఆత్రేయ సంభాషణల కర్త

## లక్ష్మి ప్రద!

శోభన్‌బాబు వెరైటీ పాత్రను పోషిస్తున్న ''మిష్టర్ సంపత్ ఎం ఏ'' చిత్రంలో లక్ష్మి, జయప్రద హీరోయిన్ వేషాలను వేస్తున్నారు సహాయ పాత్రలను రాజబాబు, రమాప్రభ పోషించ గలరు

'దొరలు–దొంగలు' లో వాణిశ్రీ

GEMINI

# జెమినీ టీ

## రుచికి రాజమకుటం ఈ టీ




ఇదుగో సిరులెన్నో ఉప్పొంగే జెమినీ టీ.
రాజదర్బారు యొక్క అనుభవం చవిచూస్తారు మీరు.
ఆ దర్జా రాసికి చెందిన చిక్కని టీ.
అందుకే మీకు మరిన్ని కప్పులనిస్తుంది.
ఇది మీరు ఉత్సవం జరుపుకునేలాంటి పొదుపు.
ఇంకనుంచి ఉత్సాహంతో ఉవ్విళ్ళూరండి, జెమినీటీతో.

**జెమినీటీ టాటా-ఫిన్లే వారిది.**

# సినిమా



'సెక్రటరీ' లో అక్కినేని

## గమ్మత్తయిన గెటప్‌లో శోభన్

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న "రాజు వెడలె" వర్ణ చిత్రంలో శోభన్‌బాబు గమ్మత్తయిన గెటప్‌లో కనిపించి, తన వాక్చాతుర్యంతో కడుపుబ్బ నవ్విస్తారు. హాస్యరసపోషణలో శోభన్ గట్టివాడు అని ప్రేక్షకులు ఒప్పుకునేవిధంగా "రాజువెడలె" చిత్రంలో ఆయన నటించారు.

శోభన్‌కు జవరాలుగా జయసుధ, చెల్లెలుగా జయప్రద, చెలికాడుగా రాజబాబు నటించారు. ముఖ్య పాత్ర నొకదాన్ని సత్యనారాయణ పోషించారు. సంగీతాన్ని మహదేవన్, ఛాయాగ్రహణాన్ని కన్నప్ప, రచన్ను సత్యానంద్ నిర్వహించారు.

మామూలు చిత్రాలకు భిన్నంగా "రాజు వెడలె" వున్న నిజాన్ని ప్రేక్షకులు హర్షించి, ఆదరించగలరు. ఈ చిత్రాన్ని వుషారుగా, వేగంగా దర్శకుడు తాతినేని రామారావు నడిపించారు. నిర్మాత పూర్ణచంద్రరావుకు "రాజువెడలె" చిత్రం కనకవర్షాన్ని కురిపిస్తుంది.

## వైవిధ్యం వున్న ద్విపాత్రాభినయం

విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న భారీ వర్ణ చిత్రం షూటింగు ఏప్రిల్ ఎనిమిది నాటికి పూర్తవుతుందన్న వార్తను, నిర్మాత త్రివిక్రమరావు చెప్పారు.

ఈమధ్య ఊటీలో శోభన్, మంజుల, జయసుధ పాల్గొన్న రెండు యుగళగీతాలను చిత్రీకరించి, ఆంధ్రదేశంలోని ఒక చిన్ని గ్రామంలో పతాక సన్నివేశాలను పూర్తి చేసినట్టు, దర్శకుడు టి. కృష్ణ చెప్పారు.

"మానవుడు...దానవుడు" చిత్రం తరువాత వెరైటీ వున్న డ్యూయెల్ రోల్‌ను తను పోషిస్తున్నట్టు, హీ–మాన్ చెప్పారు.

అన్నితరగతుల వారిని ఆకర్షించి, ఆకట్టుకునే అంశాలు వున్న విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వారి చిత్రానికి వసూళ్ళు విరివిగా వుండగలవన్న అభిప్రాయాన్ని, రషస్ చూచిన విమర్శకులు వెల్లడించారు.

ఈ చిత్రంలో రావుగోపాలరావు, ప్రభాకర రెడ్డి, శ్రీధర్, రాజబాబు, అనుపమ, రోజా రమణి, కాంతారావు మరియు అంజలీదేవి ప్రధాన పాత్రలను పోషించారు.

ఈ చిత్రానికి మహదేవన్, జి. కె. రాము, సత్యానంద్ వరుసగా సంగీతాన్ని, ఛాయాగ్రహణాన్ని, సంభాషణలను నిర్వహించారు.

ఈ చిత్రం విడుదలానంతరం టి. కృష్ణ అగ్రశ్రేణి దర్శకుల లిస్టులో చేరడం తథ్యం.

## రామరాజ్యంలో రక్తపాతం

హీరో కృష్ణ దొరగా, దొంగగా ద్విపాత్రాభినయం చేస్తున్న "రామరాజ్యంలో రక్తపాతం" వర్ణ చిత్రం షూటింగు విమాన వేగంతో పరుగిడుతున్న నిజాన్ని నే కళ్లారా చూశాను.

## విదేశీ విగ్గు!

"దొంగ" పాత్రకు పెట్టిన విగ్గును, దొర పాత్రకు పెట్టిన విగ్గును విదేశాల నుంచి దిగుమతి చేయించినట్టు, కృష్ణగారి మేకప్‌మ్యాన్ మాధవరావు చెప్పారు. కృష్ణలో కొత్త అందం అగుపించింది.

"రామరాజ్యంలో రక్తపాతం" చిత్రంలో రావు గోపాలరావు మంగళ మహారాజుగా విచిత్రమైన వేషాన్ని వేస్తున్నారు. మంగళవారంనాడు మౌన వ్రతం ఆచరించడం యీ పాత్రకు అలవాటు. వచ్చే యిక్కట్లన్నీ అదే రోజున వస్తాయి. విచిత్ర ధోరణిలో సాగే యీ పాత్ర రావుకు కొత్త కిరీటాన్ని తెచ్చిపెడుతుంది.



'నిజం నిద్రపోదు' లో త్యాగరాజు, మమత

## పక్షితీర్థంలో శివప్రసాద్ యూనిట్!

శివప్రసాద్ యూనిట్ ఇటీవల పక్షితీర్థానికి తరలివెళ్లింది. తమ చిత్రం "ఒక దీపం వెలిగింది"కి సంబంధించిన కొన్ని సన్నివేశాల చిత్రీకరణ కోసం ఈ టూర్ ప్రోగ్రామ్ వేసింది శివప్రసాద్ మూవీస్.

మనకున్న పవిత్ర పుణ్యక్షేత్రాల్లో పక్షితీర్థం ఒకటి. పక్షులు రెండు ప్రతి మధ్యాహ్నం ఆ ప్రదేశంలో వెలసివున్న స్వామివారి దరిచేరి, ప్రసాదాన్ని అర్చకస్వామి చేతులమీదుగా తీసుకెళ్లి ఆరగిస్తాయని కథలుగా చెప్పుకోవడమే కాకుండా, కళ్లారా చూస్తున్నారు రోజూ ఎందరో, ఈ అద్భుతాన్ని చూడడానికని మూల, మూలనుంచీ జనం రావడం- జరుగుతూంది. ఇలాంటి ప్రఖ్యాతిగాంచిన స్థలంలో సింగీతం శ్రీనివాసరావు తన దర్శకత్వంలో తయారవుతున్న "ఒక దీపం వెలిగింది" చిత్రంలోని ముఖ్యమైన సన్నివేశాలను కొన్నింటిని షూట్ చేసారు.

## రంగనాథ్. చంద్రకళ

పొడుగు మనిషి రంగనాథ్, చంద్రబింబం చంద్రకళ కాంబినేషన్‌లో నిర్మితమవుతున్న ఈ చిత్రంలో జగ్గయ్య, గుమ్మడి, అల్లు రామలింగయ్య, కె. వి. చలం, సత్యేంద్రకుమార్, శుభ ముఖ్య పాత్రధారులు. జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి, ఘంటా సాంబశివరావు నిర్మిస్తున్న ఈ చిత్రానికి పి. నాగేశ్వరరావు కథను, బి. ఎల్. యస్. ఆచార్య మాటలను, యస్. రాజేశ్వరరావు స్వరాలను, సుఖదేవ్ ఛాయను, వాసు కూర్పును, కె. వి. కృష్ణయ్య సహకార దర్శకత్వమును, సి. వి. యస్. రామారావు నిర్మాణ కార్యక్రమమును సమకూరుస్తున్నారు.

(30వ పేజీ చూడండి)



'ముద్దబంతిపువ్వు' లో మురళీమోహన్

‘‘జీతం ’’ నసిగాడు ఉద్యోగి

‘‘ఊఁ ’’ హుంకరించాడు యజమాని

‘‘జీతం పెంచండి సార్ !’’ చేతులు నలుపుకుంటూ అన్నాడు నౌకరు రామారావు

యజమాని సుబ్బరామయ్యగారు కళ్ళజోడు సవరించుకొని ఓసారి ఎగాదిగా చూసి ‘‘ఏవిటీ, జీతమా ?’’ అన్నారు అవునన్నట్టు తలూపాడు రామారావు

‘‘పెంచాలా ?’’

‘‘ఊఁ !’’

‘‘ఎందుకూ ?’’

ఎందుకేమిటె అర్థంలేని ప్రశ్న !

‘‘చాలటంలేదండీ !’’

‘‘ఎందుకు చాలటంలేదు ?’’

చాలటంలేదంటే యెందుకంటాడేమిటి ? యేమిటా చచ్చుప్రశ్న ?

‘‘ధరలు మండిపోతున్నాయి. రూపాయిపెడితే అరకేజీ వంకాయలు రావటంలేదండి ’’

‘‘అరకేజీ రాకపోతే పావుకేజీయే కొనుక్కోవాలి ’’

‘‘పావుకేజి సరిపోవండీ ’’

‘‘ఎందుకు చాలవు ?’’

మళ్లీ యిదేం ప్రశ్న ? యెందుకు చాలవేమిటి !

‘‘మా ఆవిడా నేనూ పిల్లాడు ముగ్గురికీ పావుకేజీ యెలా సరిపోతాయండీ ?’’ నవ్వుతో అన్నాడు

‘‘ సరిపెట్టుకోవాలోయ్ ! ’’

ఈయన ఇంట్లో ఏదైనా రవ్వంత తక్కువైతే నన్ను పదిసార్లు బజారుకి తిప్పి తెప్పించుకుంటారు ! పావుకేజీ యెవరికి సరిపోతాయనుకుంటున్నాడీయన ?

* * *

‘‘సరే, ఆవర్జాలో అకౌంటు వ్రాసేసావా ?’’

‘‘వ్రాసేసానండి ’’ వినయము, విధేయత పుట్టిపడేలా అన్నాడు

‘‘ఆ ఆవర్జా యిలా అందుకో !’’ కళ్ళజోడు పైనుంచి చూస్తూ అన్నారు యజమాని

ఆవర్జా పుస్తకం పట్టుకొచ్చి ముందు పెట్టాడు కలాన్ని ఒక విదుపు విదిపి పుస్తకంలో వ్రాసుకోవటం ఆరంభించారు రామారావు అటు యిటు, ఒక్కోసారి ఆయన ముఖంకేసి చూస్తూ నిలబడ్డాడు సుబ్బరామయ్యగారు ఆవర్జా పుస్తకం మూసేసి పక్కనపెట్టి, ఓసారి మెడ వంకరగా అటు యిటు తిప్పి, మళ్లీ యింకో పుస్తకంలో తల దూర్చారు




ఈయన జీతం సంగతి చెప్పడేమిటి ? సంవత్సరం పైన అయింది జీతం పెంచి ఇంకా వట్టి యెనభై రూపాయలే ! మార్కెట్లో ధరలు రెండురెట్లు పెరిగాయి కాని, జీతం ఒక్క రూపాయికూడ పెంచలేదు బి కాం పేసయి ఉద్యోగంకోసం తిరిగి తిరిగి ఏదీ గతిలేక ‘టింబర్ డిపోలో’ గుమాస్తా (కమ్ ప్యూనుగా) కుదిరాను ఇచ్చే నాలుగు డబ్బులైనా సరిగా యివ్వరు వెధవ వుద్యోగం !

సుబ్బరామయ్యగారు పుస్తకం మూసి పైకి లేవారు

‘‘నా జీతం ’’ నసిగాడు రామారావు

‘‘పెంచాలా !’’

‘లేకపోతే గడ్డితిని బతకమంటారా ?’ అని మనసులో అనుకొని ‘‘అయ్యా’’ అన్నాడు బుర్ర గోక్కుంటూ

‘‘చూద్దాంలే ఆనక ’’

‘‘చానాళ్లనుంచీ చూద్దాంలే అంటూ మాటల్తోనే గడిపేస్తున్నారు ’’

‘‘చాల ముఖ్యమైన పని ఒకటుండిపోయిందోయ్ ! ముందది చూడు డి సి టి ఓ ఆఫీసుకెళ్లి ఆయన ‘మామూలు’ యిచ్చెయ్యాలి అర్జంటుగా’’

‘‘అలాగేనండి ’’

మూడు వందనోట్లు రామారావుకి అందించాడు

‘‘త్వరగా వెళ్లాలిసుమా !’’

జీతం పెంచకపోయినా పని మాత్రం నిఖచ్చిగా చేయించుకుంటారు !

తలూపి సైకిలెక్కాడు

* * *

వాకిట్లో సైకిల్ స్టాండు వేసి ఇంట్లోకి నడిచాడు

‘‘నాకు భోజనం వడ్డించు త్వరగా వెళ్లాలి ’’ శ్రీమతిని కేకేసాడు

పలకలేదు

గదిలోకి చూశాడు

శ్రీమతి మంచంమీద పడుకొనివుంది

మళ్లీ కేకేసాడు

‘‘భోజనమేగాని, నా బట్టలన్నీ చిరిగిపోయాయని చెప్తే నామాట మీరు పట్టించుకోలేదు ’’ అని గొణుక్కొంటూ లేచి, వడ్డించింది

‘‘నీ మాట నేను పట్టించుకున్నాను కాని, నామాట మా ఓనరే పట్టించుకోలేదు, జీతం పెంచమంటే !’’ విసుగ్గా అన్నాడు,

‘‘సంసారంలో ఒకటుంటే ఒకటి లేదు మాయదారి బతుకులు మాయదారి వుద్యోగాలు! ’’

## సంపాదన

అంటూ తన బాధనంతా వెళ్లగక్కింది

రామారావు హడావిడిగా నాలుగు మెతుకులు మింగి సైకిలెక్కాడు.

ఆఫీసుముందు సైకిల్‌కి తాళమేసి డి సి టి ఒ రూం దగ్గిరికి వెళ్లాడు

కిటికీలోంచి తొంగిచూశాడు ఆఫీసరూ యింకా ఎవరో వున్నారు నోట్లు చేత్తో పట్టుకుని నిలబడ్డాడు ఇంతలో సుబ్బరామయ్యగారు వచ్చారు

ఏమిటీ, ఈయన వచ్చాడు ? నన్ను పంపిం తర్వాత యీయనకు పనేమిటి ? ఎందుకొచ్చాడు ?

"ఇచ్చేశావా ?" అన్నారు కంగారుగా

"ఇవ్వలేదు "

"అయితే యిలా ఇయ్యి నేనిస్తాను "

నోట్లు ఆయన చేతిలో పెట్టాడు

ఆయన లోపలికెళ్లి వెంటనే తిరిగొచ్చారు

"మేమంతా 'లయన్స్ క్లబ్'లో మెంబర్లవటం వలన ఆయన తీసుకోవటానికి మొహమాటపడ్తున్నాడు తీసుకోవటంలేదు మా ఓనరు పంపించారని చెప్పి ఎలాగో నువ్వే యిచ్చేసి వచ్చెయ్యి !"

రామారావు తలూపాడు

"మరి నా మామూలివ్వరండీ ?" ఆడిటరు వచ్చాడు

"నీకూ యిప్పుడే కావాలా ?" అని, బయట హోటల్‌కు వెళ్లి వందనోటు మార్చి పట్టుకొచ్చారు పాతిక ఆడిటరు చేతిలో పెట్టి మిగిలిన రెండువందల డెబ్బైఅయిదు రూపాయలు రామారావు కిచ్చారు

"నేను కాఫీ తాగుతాను నువ్వు నెమ్మదిగా ప్రయత్నించు" అనేసి వెళ్లిపోయి హోటల్లో దూరారు

మీ ఆకలివంటి ఆకలికాదా నాది ? టేబీళ్ళు కూడ పోయించరు వందల వందలు లంచాలు పోస్తారు కష్టపడి పనిచేసేవాళ్లకి జీతం పెంచమంటే పెంచరు మీ లాభాలు చూసుకుంటారు మాకుమాత్రం పొట్ట గడవద్దూ ! కసిగా చేతిలో వున్న నోట్లలోంచి 'పాతిక' తీసి జేబులో కుక్కాడు

ఆఫీసరు రూంలోకి వెళ్లాడు

రెండువందల యాభయిరూపాయలు డి సి టి ఒ చేతిలో పెట్టాడు

నోట్లు లెక్కపెట్టుకోకుండానే జేబులో పెట్టుకున్నాడు ఆఫీసరు

బైటకు వచ్చాడు రామారావు

ఓనరు దగ్గరకెళ్లి యిచ్చేశానని చెప్పాడు

"అయితే నువ్వు బాకీలకు వెళ్లిరా !" సుబ్బరామయ్యగారి మాటలతో హుషారుగా సైకిలెక్కాడు

బట్టలకొట్లో కెళ్లి చీర ఒకటి తీసుకున్నాడు ఇంటికెళ్లాడు

"నీకో కానుక పట్టుకొచ్చాను " అన్నాడు చీరని చేత్తో ఆడిస్తూ

"ఏమిటి ?" అంటూ మంచంమీదనుంచి లేచి కూర్చుంది శ్రీమతి

"చూస్కో !"

"ఎక్కడిది ?" సంతోషపడిపోతూ చీర నందుకుంది

"సంపాయించాను " గర్వంగా అన్నాడు రామారావు

---

## కాలమిచ్చిన తీర్పు

(23వ పేజీ తరువాయి)

"విశ్వం ! ఇప్పటికీ మించిపోయిందిలేదు కొన్ని నెలలుగా నువ్వు మా ఇంట్లోనే ఉన్నావు – అయినా నా బిడ్డలతో సమం అనుకుంటాను నీకు పెట్టిన ఖర్చుల్ని గురించి కూడా నేను బాధపడను– ఇది నేను మనస్ఫూర్తిగా అంటున్న మాటలు అయితే నువ్వు హృదయపూర్వకంగా నీ నిర్ణయం ఏమిటో చెప్పెయ్యి వైవాహిక బంధం కావాలంటే ఏర్పడుతుంది కాని వద్దంటే పోదు అగ్నిసాక్షిగా ఏ స్త్రీనయితే అర్ధాంగిగా స్వీకరిస్తావో ఆదే వ్యక్తితో నువ్ జీవితమంతా గడపాలి సుజాత నువ్వు రోజూ చూస్తున్న మనిషే ఆమె అందచందాలు — లోపాలు కూడా తెలుసు నీకు దాన్ని చేసుకొంటే అది జీవితాంతం నిన్ను వదిలిపెట్టదు ఇక నీ సుఖ సంతోషాలన్నీ దాంతోనే అంతా అయిపోయాక మధ్యలో నీవు దాన్ని అవునన్నా కాదన్నా —అది సుజాతను వంచించినట్లు కాదు మాకు మనస్తాపం కలిగించినట్లే ఇన్ని ఆలోచించుకోవాలి విశ్వం, నువ్వు నాకు అల్లుడు కాబోయేముందు నిజమంటావా, కాదా ?" — వెనకు ముందు చూసుకోకుండా మాట్లాడేస్తున్నాడు సుబ్బరామయ్య

"నిజమే సర్ అయితే నేను ఆలోచించుకోవలసిందేం లేదు ఇప్పుడు నన్ను మీరు ఏ విధంగాను శంకించవద్దు మీ మాటకు నేను ఎప్పుడూ కట్టుబడి ఉంటానండీ" — విశ్వం తన మనసులో మాటను చెప్పేశాడు

"సరే విశ్వం నువ్ సుజాతను చేసుకున్నాక మనసు ఒకచోట మనుగడ మరొకచోట కాకుండా మీరు సుఖంగా బ్రతకటమే నాకు కావలసింది ఇక నిన్ను ఒకటికి పదిసార్లు ఈ విషయం అడగను నీ మాటను నమ్మేశాను పోతే, నీ ఉద్యోగం — పెళ్లి అయ్యాక అయినా సరే, ఏదో ఏర్పాటు చేస్తాను దీన్నిగురించి నువ్వు దిగులుపడకు" అన్నాడు సుబ్బరామయ్య ఒక నిర్ణయానికి వచ్చి

రామనాధం తేలిగ్గా శ్వాస పీల్చాడు

ఆ మర్నాడే ముహూర్తం పెట్టుకున్నారు

సుబ్బరామయ్య అంతటితో ఒక ఒడ్డున పడ్డట్లు ఫీలయ్యాడు రామనాధం ఆ సాయంత్రమే వెళ్లిపోయాడు

అయితే ఈ సంగతి తెలిసి — నాకు తలనొప్పిగా ఉందంటూ ఆ రాత్రి భోజనమే మానేసింది సుమ

సుబ్బరామయ్య, సుందరి ఆమె మాట నిజమే అనుకున్నారు కానీ, సుజాత చెల్లెలి మాట నమ్మలేదు సుమ మనసు — ఆశ ఆమెకు తెలుసుమరి

విశ్వంతో తనకు పెళ్లి— ముహూర్తం నిర్ణయించుకున్నా, 'ఇది జరుగుతుందా ?' అనే విషయంలో సుజాతకు ఏమాత్రం నమ్మకంలేదు

తన వివాహమనేదే ఒక యజ్ఞం దాన్ని తన తండ్రి ప్రారంభించాడు మొండిగా నెరవేరుతుందన్న ఆశ ! — ఈ లోపల ఎన్ని విఘ్నాలో, ఎంత మంది అడ్డువస్తారో ? ఆశించిన ఫలం దక్కుతుందో, దక్కదో — ఇది దైవనిర్ణయం మీద ఆధారపడి ఉంది అంతే

[ఇంకా ఉంది]

---

## సినిమా

( 28వ పేజీ తరువాయి)

### అక్కినేని వాణిశ్రీల ప్రణయం

"సూపర్ స్టార్"! అక్కినేని దగ్గర 'అగ్రనటి' వాణిశ్రీ కార్యదర్శిగా చేరింది ఆమెపట్ల నాగేశ్వరరావుకు ప్రేమ మొలకెత్తింది వన్‌సైడ్ లవ్ కాదు గాబట్టి, వాణిశ్రీ తన బాస్‌కు మనసిచ్చింది

ప్రేమ ముదిరిన అక్కినేని వాణిశ్రీ, పాన్పుపై పవలించి ఒకరొకరు కన్నార్పకుండా చూడసాగారు ఇద్దరూ మౌనవ్రతాన్ని ఆచరించారు పరస్పరం "ప్రేమ"లోని మాధుర్యాన్ని గోలారు

"ఏంటలా చూస్తున్నారు ఏదైనా
మాట్లాడండీ, అంది వాణిశ్రీ
నీ అందాన్ని జుర్రుకుంటున్నాను మాటలు
రావడం లేదే" అంటూ ఆమెను తన అధీనం చేసుకున్నాడు, అక్కినేని

ఈ మధుర క్షణాలపై ఆచార్య ఆత్రేయ రాసిన గీతాన్ని పాఠకులకు తెలుపుతాను

"పెదవి విప్పలేను, మనసు చెప్పలేను
పెదవికి వూహలు లేనేలేవు
మనసుకు మాటలు రావు " ఈ పాటకు మహదేవన్ సమకూర్చిన సంగీతం, రామకృష్ణ సుశీల పాడిన విధానం, అగ్రద్వయం అభినయించిన తీరు యువ హృదయాల్లో పన్నీటి జల్లు వర్షించడం తథ్యము

### సెక్రటరీ సూపర్ హిట్

"బంగారుమనిషి" రామానాయుడు రంగుల్లో నిర్మిస్తున్న "సెక్రటరీ" చిత్రం పట్ల ప్రేక్షకులు పెంచుకున్న ఆశలు, ఊహలు నూరుశాతం ఫలిస్తాయి అని రాయడానికి నేను సంశయించడం లేదు "సెక్రటరీ"చిత్రాన్ని నేను జెమినీ లాబ్‌లో చూశాను

నటీనటుల్లో అక్కినేని, వాణిశ్రీ అద్వితీయంగా వున్నారు తదితరులందరూ తక్కువ చెయ్యలేదు జయసుధ, కాంచన, శాంతకుమారి అన్నపూర్ణ, సత్యనారాయణ, గుమ్మడి, రాజబాబు, రమాప్రభ, అల్లురామలింగయ్య, గిరిజ చక్కగా చేశారు

"సెక్రటరీ" చిత్రాన్ని "ప్రేమనగర్"ను మించిన చిత్రంగా రూపొందించే బాధ్యతను కె ఎస్ ప్రకాశరావు, మహదేవన్, విన్సెంట్, జి వి సుబ్బారావు, మార్తాండ్ స్వీకరించారు నవయుగ విడుదల

— శ్రీనివాస్

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

బి. జె. పి. మహబూబునగరు

'క్షమించండి నాకు ఛందస్సురాదు' అన్నారు నిజమేనా ? లేక....

ఇంత చిన్న విషయానికి కూడా అబద్ధం ఆడాలా ? నిజమే ఛందస్సు రాలేదు. పాపం శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు తమ శాయ శక్తులా నాకు కాస్త వ్యాకరణం నేర్పాలని అవస్త పడ్డారు. కాని సముద్రాన్ని చెరువుకి తోలించ వచ్చే గాని నీళ్ళ తాగించకలమా ! ఎంతసేపు గురువూ లఘువూ గుర్తించడంలో ఉన్న సరదా గణాల బట్టీలో పనిచేయులేదు ! మరి కవిత్వం అలా మెరమెటిక్కులా వుంటే ఘోరం !!

ఎస్. ఎస్. పి. సూర్యారుపేట

మహిళా సంవత్సరంలో మీ మహిళలు హక్కుల కోసం పోరాడటం తప్పితే బాధ్యతలను గుర్తించేట్లు లేరు...

ప్రతి హక్కువెనకా బాధ్యత వుంటుందని ఆడవాళ్ళకీ తెలుసు. కాని బాధ్యతలబరువునే ఇన్నేళ్ళ, ఇన్నేళ్ళ, ఇన్ని యుగాలుగా మోస్తున్న మమ్మ చిన్న పాటు ఆయా జాతి ఇప్పుడే "మనకి అంతభారం ఇచ్చి హక్కులు లేకుండా చేశా రే" ప్రాతిపదికమైన నిజాన్ని కనుగొన్నారు. ఆలోచిస్తున్నారు. ఎంతసేపూ బాధ్యతలగురించే ఆలోచించాలా ఆడవాళ్ళు ? వీళ్ళ 'బాండెడ్' లేబరు కాదే !

రాము. వరంగల్

రామలక్ష్మిగారూ రఘుపతి రంగనాయ కమ్మగారి రామాయణ విషవృక్షంపై మీ అభి ప్రాయం అందిస్తారా ?

అభిప్రాయం చెప్పాలంటే అర్థం కావాలి. విధుర జనులచేతస్సై విన్నంత కన్నంత అసలు రామాయణం అర్థం అయిందనే గట్టిగా చెప్ప లేనే ఇక ఆయా ఆధునిక రామాయణం గురించి ఏం చెప్పను ? దీన్ని అక్కడక్కడ పారాయణ కార్య క్రమాలుగా పెట్టి ముందు బహుళ ప్రచారం కానివ్వండి...నెమ్మదిగా అవగాహన అవడం ప్రారం భిస్తుంది.

ఎస్. ఎ. పిహెచ్. కాశీబుగ్గ

కుండబద్దలు కొట్టినట్టు జవాబులు రాస్తారే మీరు, అలాంటివారు విప్లవాత్మకమైన కథలు రాయరెందుకు ?

చేత కాక ! 'హే మూక భూస్వాములని కస కస నరికి చంపిందనో కత్తితో కాల్చారనో రాసేస్తే విప్లవాత్మకం అయిపోయి నా కీర్తి ఆచంద్రార్కం వుండిపోతుందా ? మంత్రాలకి చింతకాయలు రాలుతాయా అంటే పాతమాటను, కథల్లో కవిత్వంలో కసాయి వూహలు చొప్పిస్తే విప్లవం అన్నది కొత్త మాటానా ? చూడండి దైనం దిన జీవనమే మహమూలు మనిషికి పోరాటం అనాడు

వై. ఎస్. జగిత్యాల

రచయితలు కూడా నవలలు చదువుతార ?

ఎందుకు చదవరు ? వాళ్ళకిమటుకు కుతూ హలం వుండదా హీరోయిన్ ఏమైపోతుందని ? !

డబ్ల్యు. ఎస్. కె. విజయవాడ

అంతర్జాతీయ మహిళా సంవత్సర సంద ర్భంగా మీరు వంట మరిచిపోయి వుంటారు నన్ను వచ్చి నేర్పమంటార ?

వస్తే కద మరిచి పోడానికి ! ఇప్పటిదాకా తిన డమేగాని వండడంచేతకాని మహిళకి. అందుకే వంటలంటే సరదా !

ఎస్. ఎమ్. విజయవాడ

ఆడవారి మాటలకి అర్థాలే వేరులే [illegible] చేర్పులు మార్పులు ఏమైనా వున్నాయేమో చూడండి.

బాగుంది. నాదేం కాకి చూపు అనుకున్నార ? ఒకేపక్క చూసి ఊహించడానికి ? ఈలైను చదవగానే తక్షణం బుర్రలో తిరిగేది 'అహా మగ వారి మాటలకి అర్థాలే లేవులే' కాబోలునని !!

వి. ఆర్. ఆర్. హైద్రాబాద్

స్నేహితు లెవరు ?

మన అదృష్టాన్ని దురదృష్టాన్ని కొలిచే థర్మామీటర్లు !

ఈ రోజుల్లో ఏ పని చేయాలన్న టైము సరిపోవడంలేదు...

పొరపాటు ఏ నిరక్షరాస్యుడినైనా అడగండి టైము లేదనేవాళ్ళ 'ఉన్నకాటికి వుంది కదా' అంటాడు.

విజయ సౌజన్య. హైద్రాబాదు

ముక్తి అన్న పదానికి అర్థం ఏమిటి ?

విముక్తి: కష్టాలనుంచో, సుఖాలనుంచో, మంచినుంచో చెడునుంచో, దేన్నించైనా విముక్తి లభించడమే కద ముక్తి.

వి. ఎస్. ఆర్. సికింద్రాబాదు

పెళ్ళి చేసుకోకపోతేనేం ?

ఏది పద్ధానికైనా ప్రేమ పంచుకుందు కైనా ఇద్దరు కావాలి. అందుకు.

సంతోషంగా వుండాలంటే ఏం చెయ్యాలి?

ఉన్నది సరిపెట్టుకోవడం, అవసరాలుతగ్గించు కోవడం ఈ రెండే పద్ధతులు సంతోషంగా వుండడానికి !

డి. జె. కాశీబుగ్గ

నీరుపల్లమెరుగు నిజము దేవు డెరుగు మరి మనిషి ?

గాలివాటు మెరుగు ! !

---

# ఒకేకథ రెండు ముగింపులు

(18 వ పేజీ తరువాయి)

చాను. నువ్వన్నట్లు నాకు జరిగిన అన్యాయం నీకు నేనే తిరిగి చెయ్యడం న్యాయంకాదు. ఆ బాధ నాకు తెలుసు. అనుభవించాను. వాలో నేనే కుమిలిపోయాను. రేపు నువ్వూ అంతే. తెలిసి తెలిసి నిన్ను ఆ బాధకు ఎట్లా గురిచేస్తాను? రేపు నువ్వూ ధనవంతుడివి కావచ్చు. ఈ రోజు నా కూతుర్ని చేసుకోటా నికి లేని అర్హత ఆ రోజు రావచ్చు. కాని ఆ రోజుకు నువ్వు కోరుకున్న అమ్మాయి మరో యింటి యిల్లాలవుతుంది. అప్పుడు అర్హత వుండీ చేసేదేమీలేదు. ఈరోజు నీకు ఉద్యోగం లేకపోవచ్చు. కాని నేను తల్చుకుంటే నీకు ఈ [illegible] ఉద్యోగ మిప్పించగలను. ఈరోజు నీకు కారు, రిఫ్రిజిరేటరు లేకపోవచ్చు. కాని నా కూతుర్ని చేసుకున్న మరుక్షణం నుంచి అవి నీవే. ఎందుకంటే నాకు కూతురైనా, కొడుకైనా మాధవే. అంటే నా ఆస్తంతా నా కూతురిదే. నా కూతుర్నే నీ చేతుల్లో పెడుతున్నప్పుడు ఈ ఆస్తిని నేనేం చేసు కుంటాను? అంతా నీదే. అంటే నేను కోరు కునేఅర్హత నీకు పెళ్ళయిన తర్వాత వస్తుంది. అందుకే నీకు నా కూతురు 'మాధవినిచ్చి పెళ్లి చేద్దామనుకుంటున్నాను'' అన్నారు విశ్వనాథం నవ్వుతూ..చాలా ప్రశాంతంగా వుంది ఆయన ముఖం.

కలోనిజమో అర్థంకాలేదు.ఇంతకుముందు నన్ను అవమానించిన విశ్వనాథంగారేనా ఇలా మాట్లాడింది?! నమ్మశక్యం కాకుండావుంది. లీడింగ్ లాయర్ విశ్వనాథంగారి ఏకైక కూతుర్ని ఓ పేదవాడికిచ్చి...ఆయన మంచి తనాన్ని, ఉదారస్వభావాన్ని, ఆయన గొప్ప తనాన్ని అంచనా వేసుకోలేకపోయాను. ఇటు వంటివ్యక్తి నా నేనుతప్పుగాఅంచనావేసుకుంది? ఏం మాట్లాడాలో, ఎలా ప్రవర్తించాలో ఆ క్షణంలో నాకు తెలీలేదు. ఆయన ఇంకా నవ్వుతూనే వున్నారు నావేపే చూస్తూ.

చివరికి లేచి నిల్చుని "మిమ్మల్ని అపార్థం చేసికొని ఇష్టం వచ్చినట్లు మాట్లాడాను, క్షమించండి" అన్నాను రెండు చేతులు జోడించి నమస్కరిస్తూ.

# ప్రతి ఒక కప్పులోను 100% పరిశుద్ధమైన కాఫీని ఇచ్చే ఇన్‌స్టెంట్ కాఫీ ఒక్కటే!

# ఇది.




కారణం? నూటికి నూరు పాళ్ళు పరిశుద్ధమైన కాఫీని ఇచ్చేది నెస్‌కాఫే ఒక్కటే. దక్షిణ భారతదేశంలో లభ్యమయ్యే అత్యుత్తమమైన కాఫీ గింజలతో తయారైనది. పరిశుద్ధమైన డికాక్షన్ కాఫీకి ఉండే కమ్మని సువాసనను, తృప్తికరమైన రుచిని అనుభవించండి. నెస్‌కాఫే త్రాగండి.



ప్రపంచమంతటా
అత్యధికంగా
అమ్ముడుపోయే
ఇన్‌స్టెంట్ కాఫీ

A NESTLÉ product

# నెస్‌కాఫే

—100% పరిశుద్ధమైన కాఫీతో తయారయ్యే
ఒకే ఒక్క ఇన్‌స్టెంట్ కాఫీ

NNCM 21 TEL

# ధర్మపథం —బులుసు వేంకటరమణయ్య.

## నిప్పుపుల్ల - మనస్సు

అగ్గిపెట్టెలోనుంచి ఒక పుల్లను తీసి, పెట్టెకు ప్రక్కభాగాలకు అంటియున్న మందుపై గీచినట్లయితే ఆ పుల్ల మండడం ప్రారంభిస్తుంది. ఆ నిప్పుపుల్ల తడిగా ఉన్నట్లయితే వెలగదు దానిని మన రెండు అరచేతులమధ్యనూ ఉంచి, బాగా రాపిడి చేసి, ఆ తర్వాత వెలిగించినా కొంత పొగ వస్తుందే కాని ఎంతమాత్రమూ మండదు. అది మండాలంటే చెమ్మ లేకుండా ఉండాలి.

ఇది అందరికీ అనుభవంలోఉన్న విషయమే. ఈ విధంగానే సంసారంలో మునుగుతూ తేలుతూ, ప్రతి విషయాన్నీ సంసారపరంగానే చూచేవారి మనస్సుకు ఎంత ప్రయత్నించినా భగవంతుని గురించిన చింతన ఎక్కదు ఎడతెగకుండా బోధించినా – రాపిడిపొందిన అగ్గిపుల్ల వెలుగుకి బదులుగా పొగను వెళ్లగక్కినట్లు ఆ ప్రబోధం అస్తవ్యస్తంగానే ఉండిపోతుంది. దానివల్ల ఎట్టి ప్రయోజనం ఉండదు

భగవంతుని గురించిన చింతన మనస్సునకు బాగా ఎక్కాలంటే అది నిర్మలంగా ఉండాలి. మరొక విషయాన్ని గురించి మనస్సులో ఆలోచన పెట్టుకున్నప్పుడు ఈ ఆలోచన ఎక్కదు ముక్తిని పొందడానికి మంచి అవకాశం కలిగినా అది చెయ్యిజారిపోతుంది.

వెనకటికి పరమ భక్తుడైన రామదాసుని గురించిన ఒక కథ వున్నది దాని సత్యాసత్యాల సంగతి ఎలా వున్నా గ్రహించవలసిన విషయం చాలా గొప్పది

రామదాసు భక్తికి చాలా సంతోషించి భగవంతుడు అతనిని తనవద్దకు పిలిపించుకొనడానికి విమానం పంపాడు రామదాసు విమానం ఎక్కుతూ, భగవద్భక్తి కల తన భార్యను కూడా విమానం ఎక్కమంటే ఆమె "ఒక క్షణం ఆగమనండి వంటింట్లో అన్నిటిమీదా మూతలు సరిగా వున్నాయో లేదో చూచి వస్తా' నన్నది ఆమెకు అట్టి స్థితిలో కూడా సంసార తాపత్రయం పోలేదు మనస్సు నిర్మలం కాలేదు ఆమె కోసం విమానం ఆగుతుందా ? ఒక్క రామదాసునే తీసుకుని అది వెళ్లిపోయింది అతని భార్య ఆ గొప్ప అవకాశాన్ని పోగొట్టుకుని అక్కడే ఉండిపోయింది.

జీవం ఉన్నంత కాలం మనస్సు లౌకిక విషయాలపైకి పరుగెత్తి పోవడం సహజమే అయినా —'భగవంతుని ప్రార్థించినపుడైనా' మనస్సులో వేరే తలపు లేకుండా ఉండాలి అందుకు ప్రయత్నం చెయ్యాలి

# వారఫలం

—మహేష్—

23-4-1976 శుక్రవారం మొదలు
29-4-1976 గురువారం వరకు

**మేషం** — నూతన వ్యవహారాలు లాభిస్తాయి రావలసినడబ్బు అందు తుంది వారం మధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు– కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం**.— వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి మిత్రుల సహాయం లభిస్తుంది వారం ఆఖరులో మీరు శ్రమ పడినా, ప్రయోజనం ఉండదు స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి

**మిథునం** — అనుకూలమైన వార్తలను వింటారు. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది ప్రయాణాలు ఫలిస్తాయి వృత్తిలో ఆదాయం బాగుంటుంది స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు

**కర్కాటకం**.— సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది చికాకులకు గురి కాగలరు వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**సింహం** :— ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి వారం మధ్యలో శ్రమ కలుగు తుంది ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు యేర్పడతాయి.

**కన్య** :— మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి పోటీవారితో వాదప్రతివాదలు తగవు. రావలసిన డబ్బు అందు తుంది వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు వారం ఆఖరులో వ్యతిరేకమైన పరిస్థితి యేర్పడగలదు స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. అనవసరమైన వ్యయం చేస్తారు.

**తులం**.— వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. దైవకార్యాలు నెరవేరతాయి. వారంఆఖరులో మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం** — ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అనవసరమైన సందేహాలు తొలగుతాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది దైవకార్యాలు నెరవేరతాయి

**ధనుస్సు** — వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది ప్రయాణాలు ఫలిస్తాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ముమ్ముందు లాభించ గల వ్యవహారాల్లో అభివృద్ధి సాధిస్తారు స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు

**మకరం** — మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి మిత్రులు సహాయం చేస్తారు అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి మీ మంచితనమే మీకు ఇబ్బందినికలిగిస్తుంది స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి సంతోషకరమైన వార్తలను వింటారు.

**కుంభం** — ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది ప్రయాణాలు బాగుంటాయి ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మీనం** :— శ్రమకలుగు తుంది. మీ తాలూకు వస్తువులు కోల్పోవచ్చును వృత్తిలో కార్యభారం పెరుగు తుంది వారం మధ్యలో మీ కార్యక్రమాల బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు స్త్రీలకు— అధిక వ్యయం జరుగు తుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

# డిపీస్ నుండి మరొక
# వినియోగదారుని- లాభదాయక పథకం

# రూ.1·10ల తగ్గింపు

# డిపీస్ జెల్లీ క్రిస్టల్స్‌పై

మీ విక్రేతల వద్ద అనువైన డిపీస్ సదావకాశాన్ని గమనించండి. డిపీస్ యొక్క స్క్వాష్/సిరప్/క్రష్/కార్డియల్ ప్రతి సీసా ఒక కూపన్ కలిగియుంటుంది. అది మీరు కొనే ప్రతి ప్యాకెట్ డిపీస్ జెల్లీ క్రిస్టల్స్ యొక్క ముద్రించబడ్డ ధరపై రూ. 1.10లు తక్కువ కల్గియుంటుంది. కాబట్టి ఒక సీసా కొనండి. అందులో వున్న కూపన్ వేరుచేసి, అది మీ విక్రేతకిచ్చి ఆరు రకాల పండ్ల సువాసనగల డిపీస్ జెల్లీ క్రిస్టల్స్‌లో దేనినైనా తీసుకోండి.

చెర్రీ, ఆరెంజ్, రాస్ప్‌బెర్రీ, లెమన్, స్ట్రాబెర్రీ మరియు పైన్‌యాపిల్.

**నేడే కొనండి...లాభాన్ని పొందండి.**

**ఈ ఆకర్షణీయమైన సదుపాయం కేవలం 30.6.1976వ తా॥ వరకే.**

కేరళ రాష్ట్రము మినహా, భారతదేశమంతా ఈ సదుపాయం గలదు.






Interpub/HL/1/76 tel

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## అంతటి నరసింహం

గతికలేక బడిపంతులు అనేది సామెత. కాని, మనదేశంలోను, మనరాష్ట్రంలోను సంఘసంస్కరణలకు పెదుంకట్టిన వారు బడిపంతుళ్ళు. ఈశ్వర చంద్రవిద్యాసాగరుడు బడిపంతులు. కందుకూరి వీరేశలింగం బడిపంతులు., రఘుపతి వెంకటరత్నంనాయుడు బడిపంతులు. ఈ కోవకు చెందినవాడే మిత్రుడు శ్రీ అంతటి నరసింహం కూడాను. ఏమిటి మీ అభిమాన విషయం? అని ప్రశ్నిస్తే మనుకోండి. వర్ణవర్గ బేదనిర్మూలనం, అస్పృశ్యతా నిర్మూలనం, స్త్రీ విద్యావ్యాప్తి ఇలా చెప్పుకుపోతాడు ఆయన. చిన్ననాటి నుంచి ఇవి అభిమాన విషయాలు కనుకనే జన్మస్థలమైన వెంకటరాంపుపల్లె (కడప జిల్లా రాజంపేట తాలూకా) వంటి కుగ్రామంలో గ్రామవ్యవస్థ ఏమీ మారని కుగ్రామంలో హరిజనోద్ధరణమని, నిమ్నజాత్యుద్ధరణమని పలుముకుంటూ సంఘాలు, సంఘాలు నెలకొల్పగలిగాడు. అనంతపురం ప్రభుత్వ కళాశాలలో పట్టభద్రుడైన తర్వాత, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు అభిమాన విషయంగా ఎం. ఏ.లయి, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో "ప్రబంధాలలో ప్రకృతి వర్ణనము"అనే విషయం పై డాక్టరేట్ పొంది, అనంతపురం, రాజమండ్రి, కడప, విజయవాడ, చిత్తూరు ప్రభుత్వ కళాశాలలో తెలుగు శాఖలో వివిధ పదవులు నిర్వహించి, మొన్నటి ఫిబ్రవరి నుంచి ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారిగా వ్యవహరిస్తున్నారు. సంఘసంస్కరణమే ఇతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు గనుక పరోపదేశ పాండిత్యంలాగా, తాము కులనిర్మూలన అంటూ వేదికలెక్కి ఉపన్యాసాలలో విక్రమిస్తూ, తమదాకా వచ్చేటప్పటికి తమకులంలో, అడుగుజాడుగా గట్టిగా వున్నవారినే చూచుకొనే నాయకులవలె గాక, తాను వర్ణాంతర వివాహం చేసుకున్నారు. తన దగ్గరివారందరికీ చేశారు. నాకు అన్నివర్ణాలలోను చుట్టాలు ఉన్నారండీ అంటుంటారు అందుకనే. ఇక స్థాపించిన సంఘాలు చూద్దామా, కడపజిల్లా సంస్కృతిక సంవర్ధక సంఘం, కడప జిల్లా రచయితల సంఘం, కడప జిల్లా కుల నిర్మూలన సంఘం మొదలైన వాటికి స్థాపకాధ్యక్షుడు, రాష్ట్ర కుల నిర్మూలన సంఘం కార్యవర్గసభ్యుడు. అంతేకాదు కడపజిల్లా రైలు ప్రయాణికుల సంఘం స్థాపకుడు. ప్రొఫెసర్స్ కాలనీ కో ఆపరేటివ్ హవుస్ బిల్డింగ్ సొసైటీ స్థాపకుడు. ఇలా బహుముఖ కార్యకలాపాలున్నవాడు. తన భావప్రచారానికి రచయితకావడం అనివార్యం. అస్పృశ్యతా నివారణ, సంఘ సంస్కరణ ప్రధానేతివృత్తంగా నవలలు, నాటకాలు, కవితలు, గేయాలు, ఎన్నోరచించారు. ఆదర్శం, భావం, స్వగతం, ప్రేమభిక్ష మొదలైనవి నవలలు, భావన విజయం, సహజీవనం, సమరసత్వం, మానవత్వం, పరిష్కారం మొదలైనవి నాటకాలు. అంతటిగేయాలు మొదలైనవి కవితాసంకలనాలు. కోటవీరన్న సాహసం, ఉదయగిరి కోటన్నధైర్యం, మంత్రాల రామన్న మొండితనం మొదలైనవి బాలబాలికల కోసం రచించిన నవలలు, నాటికలు. చైనాయుద్ధ సమయంలోను, బంగ్లాదేశ్ యుద్ధ సమయంలోను ఎన్నోగేయాలు ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. వర్గవర్ణవిబేదవిరహిత సంఘాన్ని, సంస్కృతిని నెలకొల్పడం లక్ష్యమైన మనకు ఎంతటి అర్హతలు ఉండాలో అంతటి అర్హతలు అంతరంగం గల మిత్రుడు అంతటి నరసింహం. తనఅభిరుచికి అనుగుణమైన శాఖను చేపట్టినాడు. గనుక రాష్ట్రానికి ఎంతటి మేలు కలుగుతుందో అని సంఘసంస్కార ప్రియులందరూ ఆశతో ఉన్నారు. సౌమ్యుడు, మాటకు ముందుముప్పేట ఆలోచన, ఆలోచనకు తగిన సంకల్పం, క్రియాశీలత గలవాడు అయిన ఈయన ఇంతటి ఆశను తీరుస్తాడు.

## సత్యసాయి హితవు

న్యాయధర్మాల చిలుకపలుకులు ఏ మాత్రమూ ప్రయోజనం లేదు. వాటిని ఆచరించడం ముఖ్యం అని శ్రీ సత్యసాయిబాబా మార్చి 28న ఇంజనీర్ల సంస్థ ఆవరణలో జరిగిన సమావేశంలో చెప్పడం చాలా మందికి కనువిప్పు కలిగించివుంటాలి. ధర్మపన్నాలు వల్లించడం ఈనాటిసంగతా? వాటిని ఆచరించడంగొప్ప. అలాంటివారే సంఘంలో వెలుగులు చిమ్మారు. తల్లిదండ్రులు ధనసంపాదనకే ప్రాధాన్యమిచ్చి, జీవితధర్మాలను విస్మరించడంవల్ల వారిసంతానం తప్పుదారులు తొక్కుతున్నదన్న మరొక సత్యం కూడా శ్రీ సత్యసాయి చెప్పారు. ఇప్పుడు యువకులలో అరాచకానికి కారణం తల్లిదండ్రులది ఒకదోవ, వారి సంతానంది మరొక దోవ కావడమేనని కొంచెం ఆలోచిస్తే ఎవరికైనా తోస్తుంది. తను సిగరెట్లుతాగుతూ, పిల్లలను వారిస్తే వారువింటారా, ఏమన్నానా? శ్రీ సత్యసాయి ఆధ్యాత్మిక విషయాలు ఏమైనా, ఏమైనా, ఆయన సంఘసేవ, సామరస్యవ్యాప్తి, అధ్యక్షత వహించిన గవర్నర్ శ్రీ సుఖాడియా అన్నట్లు ప్రజలలో త్యాగభావం, క్రమశిక్షణ వ్యాపింపజేయడానికి ఆయన తపన ఎల్లలులేనివి.

## రెండంతస్తుల బస్సు ప్రమాదం

రెండంతస్తుల మేడకూలితే ఎంతప్రమాదమో, ఖడ్గమృగం ఒరిగితే ఎంతప్రమాదమో అంతప్రమాదమూ జరిగింది రెండంతస్తుల బస్సు మార్చి 25 రాత్రి పాట్నీమలుపులో ఒరిగిపోవడంవల్ల. బస్సు సికింద్రాబాద్ స్టేషను నుంచి బొలారంకు పెళ్ళివారితో కిటకిటలాడుతూపోతూ ఒరిగింది. మొత్తం 37 మందికి గాయాలు తగిలాయి. వీరిలో ఎనిమండుగురిని గాంధీ ఆస్పత్రిలో చేర్చారు. వారికి సహాయధనం మంజూరు చేయడం, మంత్రులు అధికారులు చూడడం అంతా సజావుగానే జరిగిందనుకోండి కాని అధికారులు ఒక్కసంగతి పాటించాలి. రెండంతస్తుల బస్సులో "స్టాండింగ్ లేదు అని పై అంతస్తులో వుంటుంది. మామిడికాయంత అక్షరాలతో. కాని నిలబడేవారి సంఖ్యే కూర్చున్నవారికంటే ఎక్కువ వుంటుంది. మలుపులు తిరిగేటప్పుడు నిలుచున్నవాలు ఒకవైపునకు ఒరుగుతారు. ప్రమాదాలు సులభంగా జరుగుతాయి. అయినా రెండంతస్తుల బస్సు జంటనగరాలలో తిరగడం ఆరంభమయి తరమయింది. ఇంతవరకు ఇలాంటిది జరుగలేదు. ఈ విషయంలో డ్రైవర్లను, కండక్టర్లను అభిసంగించాలి.

ఉపశ్రుతి :

"మీరు త్యాగాలు చేయాలి. భవిష్యత్తు మీదే"అని ప్రసంగిస్తున్నాడు ఒక నాయకుడు. ప్రక్కనే ఉన్న ఒక యువకుడు "నేనేమన్నా తెలుగు సినిమా హీరోనా త్యాగం చేయడానికి?" అని నా చెవిలో అన్నాడు.

## రాలిన ముత్యాలు

........శ్రీ సోమసుందర్........

రచయితకుగల ఒకే ఒక్క పరికరం
పదం
అదే అతని కాధారం; అదే అతని
కాయుధం
మాటలతోనే బొమ్మలు కట్టడం,
పలికించడం
నడిపించడం, ఏడిపించడం-అతని
ధర్మం!
మాటలు శక్తివంతాలైతే కోటలు
దాటగలవు
చీకటిమూకల్ని భస్మీపటలంచేయగలవు
గుండెగుండెకూ కొత్త
వెలుతురు అద్దకలవు!

పురుగులు మీరు అనుకొన్న దానికంటె ఎంతో త్వరగా పెరుగుతాయి

# ఫినిట్‌ను మీ ఇంట్లో నియమంగా చిలికి

## మీ ఇంట్లో పురుగులను సురక్షితంగా, నిశ్చయంగా హతమార్చండి

ఫినిట్ క్రిమిసంహార ప్రణాళిక
ఫినిట్ ఉపయోగించే విధానం

**ఎగిరే పురుగులు**

ఈగలు, దోమలు, చిమ్మటలు మొదలైనవి. కంటికి గల విషయంలో, గదిని మూసివేసి ముందు గదంతా పొగలా నిండిపోయే వరకూ చిలకండి 15 నిమిషాల తరువాత తలుపులు తెరవండి.

**ప్రాకే పురుగులు**

బొద్దింకలు, చీమలు, పాతపురుగులు నల్లులు, ఇర్రెలు, కొరజలు, "సిల్వర్ ఫిష్" పురుగులు, విషయంలో—విలువైన సరకు పురుగుల మీద నేరుగా చిలకండి అవి దాగొనే అన్నిచోట్లా, మూలలూ, మురుగు కాల్వల దగ్గర కూడా బాగా చిలకండి. వారానికి ఒకటి రెండుసార్లు చిలకండి. గుర్తుంచుకోండి ఫినిట్ డబ్బా మీద ఇంతకంటె హెచ్చు వివరాలు ఉంటాయి తప్పకుండా చదవండి
ఈ విషయం కూడా గుర్తుంచుకోండి పురుగులు కేవలం చిరాకు కలిగించడమే కాదు జబ్బులను కూడా వ్యాపింపజేస్తాయి! అందువల్లనే ఇంట్లో పురుగులను నాశనం చేయండి విరివిగా చిలకండి వాటిని చంపే ఫినిట్.

CMHPF-3-214-Tel




ఫినిట్ ఒక శాస్త్రీయమైన ఫార్ములాతో తయారు చేసిన బహుళ వినియోగ క్రిమినాశిని అది ఎంతో శక్తివంతం కావటం మూలంగా అది తగలగానే ఈగలు, దోమలు, బొద్దింకలు, నల్లులు మొదలైన పురుగులు వెంటనే చచ్చిపోతాయి

అందుచేత, నియమంగా ఫినిట్ చిలికి మీ ఇంటిని పరిరక్షించుకొనండి.

దోమలు ఈగలు, బొద్దింకలు, నల్లుల పై

**ఫినిట్ చిలకండి వాటిని నాశనం చేయండి!**

సురక్షితంగా నిశ్చయంగా హతమార్చండి




హిందుస్థాన్ పెట్రోలియం కార్పొరేషన్ లి

# ఫాలాక్షుని డైరీ

## పరువు బరువు !

న్యూయార్క్‌లో విలియమ్ పెరీ అనే వో జడ్జిగారు థామస్‌జిరోక్కన్ అనే ఆయన నడుపు తున్న హోటలుకు కాఫీ త్రాగాలని వెళ్ళి, అంత పని చైబోయి, కాఫీ బాగులేనందువల్ల ఆ థామ స్‌ని పిలిచి నానా తిట్లు తిట్టి అమ్మకానికి సంబం ధించిన లైసెన్సును లాక్కుంటానని బెదిరించి, అంత పనీ చైబోయి, థామస్ దగ్గర కాఫీ మీద ప్రామిస్ తీసుకుని వదిలేశారట అక్కడి వినమ్రుడైన చామస్‌జిరోక్కన్ ఎర్నాడా జడ్జి గారి మీద పరువునష్టం దావా వేశాడట తన పరువు బజారుకు లాగి అల్లరిచేసిన నేరానికి ఆ జడ్జిగారి మీద 5 మిలియను డాలరుంటు పరువునష్టం దావా వేశాడట అంత పరువే

## ఆడది అబద్ధం చెపితే ....!

అబద్ధం చెప్పడంలో స్త్రీలకుండే చాక చక్యంలో పురుషులకు సగంకూడా లేదని మ్యూనిచ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రేషనల్ సైకాలజీవారు ప్రయోగపూర్వకంగా తేల్చారట వారు 3000 మందిని పరీక్షిస్తే అందులో ప్రతి మగవాడూ అబద్ధం కనిపెట్టే యంత్ర సాధనానికి లొంగి పోయినట్లు, స్త్రీలలో సగంకన్నా తక్కువమంది కూడా సంపూర్తిగా లొంగిపోనట్లు తేలిందట

## నేరాలు తగ్గాలంటే...!?!

అపరాధులను మన్నించడం, శిక్షలు తగ్గించడం అపరాధాలను, అపరారాధులను ఉత్సాహపరచడ మేనని, శిక్ష చాలా కఠినంగానూ, కర్కశంగాను ఉండాలని, మరణదండన వంటి శిక్షలు ఉండి తీరాలని, ఆ మరణదండన పుణ్ సులతో ఒకరితో అమలు జరిపి, అది టెలివిజనులో అందరికి చూపించాలని, అప్పుడే నేరాల స్థాయి తగ్గు తుందని యు ఎస్ ఏ కు చెందిన ఎసంబ్లీ ఆఫ్ గాడ్స్ చర్చికి చెందిన రివరెండ్ పాల్ బెన్ విన్‌గారన్నారట

## పిల్లల్ని కంటామని పూచీయిస్తేనే పెళ్ళి !

ఫెడరల్ జర్మనీలో అసలు జనసంఖ్య చాలా తక్కువట దీనికితోడు జన శాతం కూడా మరీ చిక్కిపోయిందిట అక్కడి బవేరియన్ టవున్ అనే చోట ఓ మేయరు గారు యీ పరిస్థితికి మిక్కిలి విచారించి, వో పథకం ఆలోచించాడట పెళ్ళిచేసుకున్న రెండేళ్ళలో గ్యారంటీగా పిల్ల (లేక పిల్లాడు)ను కంటామని వాగ్దానం చేసే జంటలకే తాను వివాహం (రిజిస్టరు) చేస్తానని, అలా చేయనివారికి చైనేచైనని అన్నారట

## బుద్బుద ప్రాయంగా మారిన పెళ్ళిళ్ళు !

అమెరికాలో వివాహబంధాలు మరీ నీటి బుడ గలై కూర్చున్నాయట అక్కడి వివాహ రద్దులు ప్రపంచ రికార్డులోనే ప్రథమస్థానం అలంక రించాయట అదీ గాక అక్కడ మరో తమాషా పెళ్ళిళ్ళు కూడా జరుగుతున్నాయట వో భార్యా భర్తల జంట ఇంకో భార్యాభర్తల జంటతో శాస్త్రోక్తంగా పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారట! ఆ రెండ్రేళ్ల నలుగురూ రెండు కుటుంబాల విషయాలలోనూ, లైంగిక వ్యవహారాలతోనూ ఎదటి జంట తోటి తోడుతో కూడచ్చుట. యాక్కురారీ

## బ్రెజిల్‌లో నిరక్షరాస్యత

బ్రెజిల్‌లో నిరక్షరాస్యులు చాలా ఎక్కువట 105 మిలియనుల జనాభాలో 32 మిలియనులు

మాత్రమే చక్కా రాసి, చదువగలరట మిగిలిన వారిలో 16 మిలియనుల మంది అంతంత మాత్రం అక్షరాస్యులట ఈ పరిస్థితికి అక్కడి ఆర్థికస్థితి కారణమనీ ఆదాయం చాలని కుటుంబాలు తమ పిల్లలను స్కూలుకు పంపడం మాని, పనికి పంపుతున్నారని అందువల్ల అక్షరాస్యత చాలా తక్కువయ్యిందని, అవుతోందని అక్కడి పరిశీలకులన్నారట ఉయార్ట్వెంటీజిట్:

ఏకధాటిగా 81 గంటలు టేబుల్ టెన్నిస్!

26 ఏళ్ల అమెరికన్ యువకుడు ఆండీ హ్యాసెక్ ఏకబిగిన 81 గంటలు టేబుల్ టెన్నిస్ ఆడి, అంతకుముందు వరకూ ఉన్న ప్రపంచ రికార్డులు బద్దలుకొట్టాడట ఆ 81 గంటల్లో ఆగడు గంట గంటకి మధ్యలో ఐదు నిముషాలు మాత్రం పానీయాలు త్రాగడానికి ఆట ఆపాడంతే మొత్తం 81 గంటలలో 80 బంతులను, 28 మంది ఎదురాటగాళ్లను మార్చాడట ●

# వెలుగు బాట

(12వ పేజీ తరువాయి)

పోలేదు రాజు కళ్ళు ఎర్రగా వాచిపోయాయి ముఖం పూర్తిగా వాడిపోయి వుంది భోజనం దగ్గర కూర్చున్నా ఏదో అన్యమనస్కంగా ముగించి లేచాడేతప్ప అసలేం తినలేదు రాజ్యలక్ష్మమ్మ కళ్లలో నీళ్ళు తిరిగాయి వాణి పరిస్థితి కూడా అలానే ఉంది ఇంకొక ప్రక్క. ఏదో తిని లేచిపోతుంది. ఎవరిలోనూ మాటాడదు పలకదు ఉలకదు. 'ఇంట్లో ఎందుకీ రకమైన సంక్షోభం ? రాజుకేం తక్కువ అయింది. వాణి కోరుకున్నట్లే రాజుతో పెళ్ళిచేసి వాళ్ళయిష్టాన్ని యిష్టంగా తీసుకుంటే ఎంత బాగుండేది ?'' అనిపించింది.. కాని భర్తని చూసాక మాత్రం ఆలోచన పటాపంచలైంది.

*    *    *

రాత్రి ఎనిమిది గంటలు దాటిపోతోంది భయంకర రాక్షసిలాగా, క్రౌర్యంగా మనిషి లోని అహంకారం లాగా, అవివేకం లాగా, మనసు లేని మనిషి హృదయం లాగా దట్టంగా లోకాన్నంతటినీ ఆవరించి వుంది చీకటి. ఆ చీకటిలో ఎక్కడ్నించో వచ్చిన రాజు భోజనం చేస్తూ ''వాణి కనిపించటంలేదు. ఎక్కడుంది ?'' అని అడిగాడు రాజ్యలక్ష్మిని

''కృష్ణ గదిలో ఉన్నట్లుంది.'' నిర్లిప్తంగా అన్నదామె యాంత్రికంగా భోజనం ముగిస్తుంటే ''తిండి బొత్తిగా లగ్గించేసుకుంటున్నావు బాబూ ! ఆరోగ్యం దెబ్బతింటుంది '' అన్నారు రాజ్యలక్ష్మమ్మ అతను ఆమెకి మనః పూర్వకంగా కృతజ్ఞత ను తెలియచేస్తున్నట్లు కళ్లు మూసుకుని ''ఆకలేయటం లేదండీ !'' అన్నాడు అని చేతిని కడుక్కొని లేచి కృష్ణవేణి గదిముందు నిల్చుని ''కృష్ణా !'' అని కేకవేసాడు వెంటనే కంగారుగా తలుపుతీసి ''రా రాజూ ! కూర్చో '' అని కుర్చీని చూపించింది రాజు కుర్చీలో కూర్చుంటూ ''వాణి ఇక్కడే ఉందా ?'' అన్నాడు

''ఆం! ఇప్పుడే పడుకొంది '' అని మంచం మీద పడుకున్న వాణిని ''లక్కా ! అక్కా ! రాజొచ్చాడు లేవే'' అని లట్టి లేపింది వాణి లేచి కూర్చుంది ఎప్పుడూ గలగలా నవ్వుతూ, ఆమె కోసం ఆమె మాటల కోసం ఆరాటపడి, చిరుకోపాలతో అలిగి కూర్చునే వాణి ఇప్పుడు మ్లాన వదనంతో కనురెప్పలు ఉబ్బి, కనిపించేసరికి రాజు మనసు ముద్దలా అయిపోయింది. వస్తున్న దుఃఖాన్ని అపుకోలేక ఏడుస్తున్న ముఖాన్ని రాజుకి చూపించలేక మోకాళ్లలో తల దూర్చుకొని ఉండిపోయింది పెట్టలు బిగించుకొని వస్తున్న దుఃఖాన్ని అతి ప్రయత్నం మీద నిగ్రహించుకొని ''వాణీ !'' అని పిలిచాడు రాజు.

ఎలకలేక పోయింది వాణి

''కోపం వచ్చిందా వాణీ ?'' రాజలా అనే సరికి వాణి వెక్కి వెక్కి ఏడవటం మొదలు పెట్టింది రాజు తమాయించుకోలేక ''వాణి! ఏమిటిది ? తప్పుకదూ ?''అన్నాడు బొంగురు పోయిన స్వరంతో ఆ పరిస్థితినీ, ఆ ఎరిస్థితిలో వాళ్ళిద్దర్నీ చూడలేక ''ఇప్పుడే



# చదువులోనో, ఆటలోనో అలసిపోయారా?





## గ్లాక్సోస్-డి మీకు తక్షణ శక్తిని ఇస్తుంది!

మెదడు, శరీరంలోని అయిదోవంతు శక్తిని ఖర్చుపెట్టేస్తుంది. ఈ శక్తి నిజానికి గ్లూకోస్ ద్వారా పూర్తిగా లభ్యం అవుతుంది ఖర్చు అయ్యే గ్లూకోస్‌ను గ్లాక్సోస్-డి ద్వారా భర్తీ చేసుకుని, తద్వారా శారీరకమైన వివిధ కార్యక్రమాలకు కూడా కావలసిన శక్తిని పుంజుకోండి. రుచికరమైన గ్లాక్సోస్-డిని నీటిలో, టీలో, కాఫీలో, పళ్ళ రసంలో లేదా దానంతట దానినే తీసుకోవచ్చును.




శరీరాన్ని
నిముషాల్లో
శక్తివంతం చేస్తుంది

# గ్లాక్సోస్-డి ® గ్లాక్సోవారి వస్తువు

dCP/GL/32 b Tel

వస్తాను" అంటూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది కృష్ణవేణి

"తప్పు అలా ఏడవకూడదు ఆ. తే. అను కున్నవన్నీ జరిగిపోతే మానవ జీవితానికి విలువేముంటుందిక?" అన్నాడు నిరాశతో వేదాంతిలా

## వెలుగుబాట

"లేదు రాజూ వీళ్ళంతా వాళ్ళ అజ్ఞాల ఉరిత్రాళ్ళకు మనల్ని బలిచేస్తున్నారు" అన లేక, అనలేక అని మళ్ళీ ముఖాన్ని రాజుకి కనిపించకుండా కాళ్ళలో తల దూర్చుకుంది.




రాజు ఆమె దగ్గరగా వెళ్ళి, "వాణీ! నావేపు చూడొకసారి నేను చెప్పిన మాట వినవా? ప్లీజ్" అని బ్రతిమలాడాడు వాణి తల ఎత్తలేదు. రాజు రెండు చేతులతో ఆమె ముఖాన్ని పైకెత్తి "ఛీ. చిన్నపిల్లలా ఏమిటీ బేలతనం?" అని వాణి కళ్ళనుండి జారుతున్న కన్నీటిని తుడిచాడు రాజు

"రాజూ!" బావురుమని అతని వక్షంమీద వాలిపోయింది అతడి కళ్ళనుండి రాలిన కన్నీటిబొట్లు ఆమె వీపుమీద పడ్డాయి. మనసు మూగగా అయి, మాటలు కరువయ్యాయి

"రాజూ! నిన్ను విడిచి నేను బ్రతకలేను రాజూ!.. నేను బ్రతకలేను" రాజును పెనవేసుకుపోయింది వాణి

"ఛే వాణీ! ఎవరైనా చూస్తే బాగుండదు ఏదీ ఒక్కసారి నవ్వు. కేరవ్స్ ఆడదామా?.." అన్నాడు వాణిని తన గుండెల మీదినుంచి లేపి, "కృష్ణా!" అని పిలిచాడు కృష్ణవేణి వచ్చింది. "కొంచెం మంచినీళ్ళివ్వు కృష్ణా" అన్నాడు. కూజాలోంచి మంచి

నీళ్ళు గ్లాసులోపోసి రాజుచేతి కందించింది కృష్ణవేణి

మంచినీళ్ళ గ్లాసును వాణి నోటి కందించాడు రాజు నీళ్ళు త్రాగిన తరువాత వాణి కొంచెం స్థిమితంగా కూర్చోగలిగింది.

"క్షమించు రాజూ! నానుంచి నువ్వనవసరంగా మాట పడవల్సి వచ్చింది నాన్నగారి చేత" భారంగా రాజు ముఖంలోకి చూస్తూ అంది వాణి.

"నా గురించి నువ్వేం బాధపడకు వాణీ నేనామాటల కర్థాన్ని విశ్వాసంలేక, తిన్న యింటి వాసాల్లెక్క పెట్టినట్లు ప్రవర్తించిన నేనే" ఆ మాటలు అప్రయత్నంగా రాజు నోటినుండి జారాయి తరువాత బాధపడ్డాడు

"సర్లే వాణీ నువ్వు నాకో మాట యివ్వాలి చేతిలో చెయ్యి వెయ్ తప్పకమాట యిస్తానని" అని చేయి చాపాడు రాజు చేతిని తన చేతిలోకి తీసుకొని ఆప్యాయంగా "వద్దు రాజూ! నీ మనసు నాకు తెలుసు. కాని ఆ మాటను మాత్రం నేనివ్వలేను రాజూ! అసలు నువ్వెందుకు నాన్నగారికి లొంగిపోయావ్? చదివించినంత మాత్రాన అతని మాటకు నువ్వు బలైపోవాలని ఎక్కడుంది?" అని అంది కోపంతో నలిగిపోతున్న మనసులో.

"తప్పు వాణీ! అలా అనకూడదు అతను దైవసమానులు. తన దగ్గర పనిచేసే ఒక సామాన్యమైన గుమాస్తా చివరి కోరికను అతను స్వచ్ఛమైన మనసుతో అంగీకరించి నన్నింతవరకూ తీసుకొచ్చినందుకు యిప్పటికే అయ్యనకు నేనెంతో ఋణపడి వున్నాను. ఆయన మాట కెదురు తిరగలేను. దయచేసి నా మాటలు మన్నించు. నన్ను మరిచిపోయి నాన్నగారు చూసిన సంబంధానికి ఒప్పుకొని హాయిగా జీవితాన్ని సాగించు" తన చేతిలో వున్న వాణి చేతిని మృదువుగా నిమురుతూ అన్నాడు రాజు.

"హుఁ!... ఇంక ఈ జీవితానికి 'హాయి' ఒకటే తక్కువ రాజూ! అణిగిపోయిన ఆశలతో కుళ్ళి కుళ్ళి జీవితాంతం ఏడ్చేకంటే ఇంత విషం తిని చచ్చిపోతే కాని హాయి దొరకదు" వాణి మాటలకు త్రుళ్ళిపడింది కృష్ణవేణి వాణి ఆకారం చూస్తుంటే అపని కూడా చేసేస్తుందేమోనన్న భయం వేసింది

"ష్ తప్పవాణీ! ఎన్ని కష్టాలను అనుభవిస్తుంటే మానవ జీవితం అంత అందంగా ఉంటుంది."

"అవును రాజూ! మనసును చంపుకున్న మనిషికి, కోరికలు నెరవేరని మనిషికి వేదాంతం దానంతట అదే ఉప్పొంగుకొని వస్తుంటుంది." ఆక్షణంతో వాణి, రాజు కూడా పెద్ద వేదాంతులలా కనిపించారు కృష్ణవేణికి.

"ఈ దేశంలో ప్రేమ అనేది ఒక శాపమూ, ప్రేమికులు శాపగ్రస్తులూ రాజూ!"

రాజు మాటాడలేదు.

"రాజూ! అప్పుడే మాట్లాడటం మానేస్తున్నావ్ కదూ?"

దానికీ జవాబివ్వలేదు రాజు. శూన్యంలో చూస్తూ మనసంతా పిప్పి చేస్తున్నట్లున్న సంఘటనలు కళ్లముందు కదులుతూంటే పిచ్చిగా రెండు చేతులతో జుట్టు పీక్కున్నాడు. అప్రయత్నంగా "నేనెందుకు బ్రతకాలింక?" అనే మాటలు మనసులో అనుకో

## వెలుగుబాట

బోయి గట్టిగా అనేసాడు వాళ్లిద్దర్నీ ఆ స్థితిలో చూస్తున్న కృష్ణవేణికి వీళ్లు పిచ్చివాళ్లయిపోతారేమో ననిపించింది పాపం, పుణ్యం అనేవే ఉంటే ఇంతలా ఆశలు అల్లుకున్న అక్కా, రాజులను దూరం చేస్తున్న ఉసురు తప్పక తండ్రికి తగుల్తుందనుకొంది తండ్రిమీద ఒక్కసారిగా చెప్పలేనంత కోపం, అతని పట్టుదల మీద అసహ్యం కలిగాయి కృష్ణవేణికి.

"రాజూ!" రాజు మాటలు వినేసరికి వాణి గుండె చెరువై రాజు ఒడిలో ఒరిగిపోయింది. కొద్దిసేపు గడిచిన తరువాత రాజు తేరుకొని, తనేమీ బాధపడనట్లుగ ఉందామని ప్రయత్నించి "వాణీ! లేమ్మా ఇలాటి విషయాలెంతగా వరిచిపోతే మన భవిష్యత్తు అంత బాగు పడుతుంది ఇంతవరకూ పెంచుకున్న మమకారాన్ని అందులో మాధుర్యాన్నీ అంత వేగరం త్రుంచుకోవటం సాధ్యంకాదు నిజమే కాని, తూర్పు పడమరలు కలియనట్లు సమాంతర రేఖలు కలియనట్లు మనం కూడా కలియం అన్న నిజం తెలిసినపుడు సాధ్యంకాని వాటిని సాధ్యం చేసుకోవటం కోసం ప్రయత్నించటం మంచిదే. ఈ అనంతమైన కాలవాహినిలో మానవ జీవితం ఒక నావలాటిది ఇది చేరవలసిన గమ్యాన్ని సురక్షితంగా చేర్తుకుంటూందో, ఏ సుడిగుండాలలో చిక్కుకుంటుందో చెప్పలేం కాని సుడిగుండాలలో చిక్కుకోకుండా ఆవలి తీరానికి చేరుకొనేటందుకే జీవన నావికుడు ప్రయత్నిస్తుండాలి" అని తన ఒడిలో తల పెట్టుకుని కన్నీటితో కరిగిపోతున్న వాణిని లేవనెత్తి, "చూడు వాణీ! లోకంలో ఎంత మంది భగ్న ప్రేమికులు ఉన్నారో తెలుసా? అసలు నన్నడిగితే జీవితంలో ఎప్పుడో, ఎక్కడో ప్రతివారూ భగ్నప్రేమికులు కాక తప్పదు అయితే వాళ్లందరూ ఏమైపోతున్నారు? .. ఏం అయిపోలేదు ... ప్రేమికులతో ఊహించుకున్న అందమైన జీవితాన్ని

**యస్.** రాంకుమార్‌కి రకరకాల ఫ్యాషన్లలో దుస్తులు ధరించడం సరదా. ఇంటర్ మీడియేట్ విద్యార్థి. హైదరాబాదులో



భాగ్యనగర్ ఫిలిమ్ యిన్‌స్టిట్యూట్‌లో ఏక్టింగ్ నేర్చుకుంటు న్నాడు. సినిమాలు చూడటం వాటిని సమీక్షించటంహాబీ. ఇప్పుడు "వస్తాడే మా బావ" అన్న చలన చిత్రంలో వేషం వేస్తున్నాను అని చెప్పాడు. జె. సి. యూత్ క్లబ్ విజయవాడలో ఏక్టివ్ మెంబర్. గిటార్ వాయిస్తాడు. ఒక ప్రక్క చదువుకుంటూనే ఏక్టింగ్ స్కూలులో డిప్లొమా తీసుకుని ఏక్టింగ్ కెరీర్‌ను కూడా బిల్డప్ చేసుకోవా లనుకుంటున్నాడు. పత్రికలలో సినిమా ప్రకటనలు, వార్తల మెయిన్ హెడింగ్‌లు చూస్తాడు. సినిమాథియేటర్ల దగ్గర బ్లాకు మార్కెట్‌లో మాత్రం కొనడు. ఇన్‌ఫ్లూయన్స్ వుంది కనుక సంపాదిస్తాడు ఆటలమీద ఆసక్తి అంతగా లేదు ఫ్రెండ్‌షిప్ మీద మోజుజాస్తి...

## యువతరం

**తె**నాలి వి. యస్. ఆర్. కాలేజి బి. ఏ. విద్యార్థి అయిన ఏ. వి. సుబ్రహ్మణ్యం అంతర్ కళాశాల సాంస్కృతిక పోటీలలో



రెండుసార్లు ఉత్తమ నటుడిగా ఎన్నికైనాడు. ఉత్తమంగా ఏకపాత్రాభి నయంచేసి ప్రశంసా పత్రాల నందుకున్నాడు. 'అంతేకాదు విచిత్ర వేష ధారణకూడా చేసి చాలా ప్రైజులు సంపాదించా న''ని చెప్పాడు. మా గురువులు అంటే మిమిక్రీ గురువుగారన్నమాట. నేరెళ్ళ వేణు మాధవ్‌గారని సుబ్రహ్మణ్యం చెప్పాడు. నాటకాలలో గురువుగారు వాళ్ళ లెక్చరర్ రచయిత మహమ్మద్ నఫీజుద్దీన్‌కి కూడా యితను కృతజ్ఞుణ్ణి అన్నాడు.

పక్కపాడి కూడా వేసుకోడట. దురలవాట్లకు దూరంగా వుండాలన్న ఆశయం. ఏ. ఎన్. ఆర్, లక్ష్మి, సంజీవకుమార్ లీనాలు తనకిష్టమైన నటులు. ఏక్టింగ్ స్కూలులో చేరాలన్నది యితని ఉద్దేశం. బి. ఏ. ఫైనలియరు అయినాకా అనుకోవేస్తే బెటర్ కదూ!

★★★

భర్తతో సాగించి జీవితానికీ కాలానికీ లొంగిపోయి చక్కగా బ్రతుకుతున్నారు. మనం కూడా అలాగే మారాలి! ఇవాళ జరిగిపోయిం దానికి చింతిస్తూ కూర్చోవటం కంటే రేపేం జరుగనుందో వేచి చూడటంలోనే మానవ జీవితానికి మహత్తరమైన ఆనందం, అందం ఉన్నాయి. జరిగిపోయింది ఒక కల అనుకొని దాన్ని మర్చిపో. అది నిజం కావాలని ఆశపడకు. నీ కాబోయే భర్త చుట్టూ ఆశలు అల్లుకోడానికి ప్రయత్నించు. చుట్టూ మమతల్ని పెంచుకో. జీవితం ఎంత మాధుర్యంగా ఉంటుందో చూడు!'' అన్నాడు రాజు. ఆ మాటలంటున్నప్పుడు అతని పెదాలపై తెచ్చిపెట్టుకున్న నవ్వు కనిపించింది. మనసులో వీస్తున్న తుఫాను, బ్రద్దలవుతున్న అగ్నిపర్వతాల వేడిగాడ్పులు నిట్టూర్పుల రూపంలో బయటపడ్డాయి.

(ఇంకా వుంది)

# ఉత్తరాలు

## అట్టమీద బొమ్మ

ముఖచిత్రం ఒక్క సినీనటులవే కాక రచయితలని కూడ అప్పుడప్పుడు వేస్తుంటే చాలా బాగుంటుంది నేను నాలుగు వారాలనుండి మీ పత్రికకు ఉత్తరాలు రాస్తున్నాను బహుశా నా అడ్రసు తప్పై ఉండొచ్చు లేకపోతేమీకు కాకా పడితే కాని ప్రచురించరన్నమాట

వనజా లక్ష్మణరావు (హైద్రాబాద్)

* * *

19–3–76 తేది సంచికకు అగ్రనటిని ముఖచిత్రంగా వేసినప్పటికి ముఖచిత్రం అంత ఆకర్షణీయంగా లేదు

"ఇద్దరం సమానమే" కథ ఈనాటి దంపతులకు చక్కని పాఠం లాంటిది

నిమ్మగడ్డ ప్రసాద్ (రేపల్లె)

## సీరియల్

కొత్త సీరియల్ "కాలమిచ్చిన తీర్పు" మొదట్లోనే మమ్మలరించింది. సీరియల్సు విషయంలో మీరు తీసుకొంటున్న ప్రత్యేక శ్రద్ధకు మా ధన్యవాదాలు

ఈ వారం "సామాన్యుని సణుగుడు" వ్రాసిన తీరు, ఎన్నుకొన్న టాపిక్ చాలా బాగున్నాయి.

కె రమేష్, కె పూర్ణచంద్ర (ఏలూరు)

* * *

26–3–76 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక నటి స్నేహలత ముఖచిత్రంతో వెలువడిన సంచికలో క్రొత్త సీరియల్ "కాలమిచ్చిన తీర్పు" చాలా బాగుంది కథల విషయంలో తీసుకుంటున్న శ్రద్ధ చాలా ప్రశంసనీయమైనది అలాగే ముఖచిత్రం విషయంలో కూడా శ్రద్ధ తీసుకొని నాటి మేటి ముఖచిత్రాలే కాక తెలుగులో ప్రసిద్ధ నటులయిన రామారావు, శోభన్‌బాబు, తదితరమైన నటుల ముఖచిత్రములు వేస్తారని ఆశిస్తున్నాను

ఉదయ భాస్కరరావు, (మలికిపురం.)

## కథలు

19–3–76 సంచికలో వెలువడినది ఈ సంచికలో ఎన్నదగిన కథలు రెండు ఉన్నాయి. "ఇద్దరం సమానమే" కథలో వైవిధ్యముంది అందరిలాగ కాక ఈ రచయిత ఈ కథ ముగింపు చేయుటలో స్త్రీ పురుషులు ఒక్క ఆకలి దగ్గర మాత్రమే సమాన మనటము సమంజసంగా ఉంది అంతర్జాతీయ తెలుగు సంవత్సరమన్నది పేరుకేగాని, మన రచయితలు, రచయిత్రులు చేసే రచనలలో ఉండుటలేదు. తెలుగు నాటకల, సాంప్రదాయాలు, ఆచారాల కట్టుబాట్లను, వాటిలోగల మంచి చెడులను స్పష్టపరచేవిగను ప్రస్తుత రచనలు ఉండుట లేదన్నది నిజం. "తప్పు తెన్నువారు" వాస్తవానికి ప్రతిబింబం

బి భాస్కరశాస్త్రి (భద్రాచలం)

# పుస్తకాలు

## తొలిమలుపు

నవల. రచన శ్రీ వీరాజీ 240 పేజీలు, వెల 6 రూపాయలు ప్రచురణ. ఎం శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికిందరాబద్ ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్డు, సికిందరాబాద్

నదికి పర్వత దశలా మానవ జీవితానికి విద్యార్థి దశ తొలిమలుపు ఈ మలుపులో వేసే ప్రతి అడుగూ, తీసుకునే ప్రతి నిర్ణయంపై భవి జీవితం ఆధారపడి ఉంటుంది తొలిమలుపుల స్వార్థ త్యాగాల సంఘర్షణని సజీవమైన పాత్రలతో ఆంధ్ర విశ్వవిద్యాలయ వాతావరణంలో రచయిత హృద్యంగా చిత్రీకరించరు. ప్రథమంగా 1960 లో ప్రచురణయై విశేష ప్రజాదరణ పొందింది. ఎమెస్కోవారు ఈ నవలని పునర్ముద్రించారు.

## గోడమీద బొమ్మ

నవల, రచన శ్రీబలివాడ కాంతారావు. 176 పేజీలు వెల 6 రూపాయలు ప్రచురణ యం శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, సికిందరాబాదు, మద్రాసు ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతి రోడ్డు, సికిందరాబాద్

మానవత్వం ఉన్న మనిషి హృదయంలోని శాంతం, సహనం, త్యాగం అన్న మధుర గుణాలూ ఏదో ఒకదృశ్యాన్ని చూసినప్పుడు పెల్లుబుకుతాయి రాముం చూపిన గోడ మీద బొమ్మ అలాగే మనసులో హత్తుకుపోయి పత్నీ కాపురం నిలబెట్టడానికి చేజిక్కిన ఆస్తిని తృణప్రాయంగా త్యజించడానికి కారణమవుతుంది. ఆస్తికోసం పడే తాపత్రయంలో ఆయినవాళ్ల ప్రవర్తనలు కూడా ఎలా మారిపోతాయో చక్కగా చెప్పిన నవల 1955లో తొలిసారి ముద్రణయి విశేష పాఠకుల నాకట్టుకున్న ఈ నవలని పునర్ముద్రించారు.

## అగ్రనటి

నటి వాణిశ్రీ అభినందన సంచిక సమర్పణ: వాణిశ్రీ ఆర్ట్సు క్లబ్, బరంపురం, ఇందులో నటి వాణిశ్రీ జీవిత విశేషాలు, ఛాయాచిత్రాలు, సహచరుల సందేశాలు, నటించిన చిత్రాలు అందుకున్న అవార్డుల వివరాలు, అభిమాన సంఘాల [illegible] అభిమానుల రచనలు ఉన్నాయి.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

అహంకారానికి
మానవత్వానికి
సంఘర్షణం!

పద్మశ్రీ-నటరత్న
N·T·రామారావు
నటించిన



ఆదిత్యచిత్ర...
రాజేంద్రకుమార్ సమర్పించు...

# మనుషులంతా ఒక్కటే

ఈస్ట్మన్ కలర్

దాసరి నారాయణరావు

నిర్మాతలు: ముద్దు వెంకటేశ్వరరావు
వి. మహేష్

శ్రీ ఫిలింస్

VEEKAY

యువతి లాగే ఉండాలని
అభిలాషపడే యువతికి



చీరలు

DCM

TEXTILES